ఆంధ్రరాష్ట్ర హైకోర్టు అవతరణోత్సవ సంచిక

మద్రాసు హైకోర్టు: మాజీ న్యాయమూర్తి సర్ వేపా రామేశం మధుర స్మృతులు
—2 వ పేజీ

# ఆంధ్రపత్రిక

ఉన్నత న్యాయస్థానాలు: రాజ్యాంగంలో వాటిస్థానం ఒక న్యాయవాది భావాలు
—4 వ పేజీ

318863

THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 41. సంచిక 93 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 5-7-1954 Reg. No.M. 1118 12 పేజీలు వెల 2 అణాలు.

# గుంటూరులో హైకోర్టు అవతరణ మహోత్సవం

## ఆంధ్రుల చిరకాలవాంఛా సాఫల్యం: చీఫ్ జస్టిసు సుబ్బారావుగారి శుభాకాంక్ష



ఆంధ్ర హైకోర్టుకు ప్రారంభోత్సవం జరిపిన భారత ప్రభుత్వ హోంమినిస్టర్ మంత్రి డాక్టర్ కైలాసనాథ్ కట్జూ

## న్యాయమూర్తుల, న్యాయవాదుల, ప్రజల సహకారంతో న్యాయస్థానాన్ని ఆదర్శ సంస్థగా తీర్చిదిద్దుకోవాలని ఉద్బోధ

"ప్రత్యేక హైకోర్టు కావాలనే ఆంధ్రుల చిరకాల మనోరథం నేడు ఈడేరుతున్నది. హైకోర్టు ఒకటి ఏర్పడడంతో మనకర్తవ్యం తీరిపోదు. అందుకు మనం అర్హులమని కూడా ఋజువు చేసుకోవాలి; మనఉన్నతన్యాయస్థానాన్ని ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దుకోడానికి శాయశక్తులా కృషిచేయాలి," అని ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావుగారు 'ఆంధ్ర పత్రిక' కు ఇచ్చిన ప్రత్యేకసందేశంలో ఉద్బోధిస్తున్నారు. న్యాయమూర్తులు, న్యాయవాదులు, ప్రజలు పరస్పరం సహకరించి వ్యవహరిస్తేనే మన ప్రత్యేక హైకోర్టును ఆదర్శసంస్థగా తయారుచేసుకోవడం సాధ్యపడుతుందని కూడా వీరిసందేశం తెలియజేస్తున్నది.

"న్యాయవాదులు వ్యవహారాన్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకొని, సమర్థమైన, సంక్షిప్తమైన వాదనలతో తగవులు శీఘ్రంగా, నిష్పక్షపాతంగా పరిష్కారం కావడానికి సహాయపడాలి." అని హితవు చెబుతున్నారు. చాటుగానూ, బహిరంగంగానూ న్యాయమూర్తులనుగాని, ఉన్నత న్యాయస్థానాన్నిగాని విమర్శించి కొత్తగా ఏర్పడుతున్నసంస్థ ప్రతిష్ఠను పాడుచేయవద్దని కూడా ప్రధాన న్యాయమూర్తి తమ సందేశంలో ఉద్బోధిస్తున్నారు.

ఆంధ్రపత్రిక సంపాదకులు ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవ సందర్భమున ఒక సందేశము నివ్వవలసిందిగా నన్ను కోరియున్నారు. వారి కోర్కె ననుసరించి యీ సందేశాన్నిస్తున్నాను. తమకు ప్రత్యేకంగా హైకోర్టు కావలెననేడి ఆంధ్రుల చిరమనోరథము 1954 జూలై 5 వ తేదీనాడు యీడేరుచున్నది. హైకోర్టు అంటూ ఒకటి ఏర్పడినంత మాత్రమున మన కర్తవ్యము తీరిపోలేదు. మనము అందుకు అర్హులమని ఋజువు చేసుకొని దానిని ఒక ఆదర్శసంస్థగా తీర్చిదిద్దుకొనుటకు శాయశక్తులా కృషి చేయవలసి వున్నది. న్యాయమూర్తులు, న్యాయవాదులు, ప్రజలు సహకరించి వ్యవహరించిననాడే అది సాధ్యమగును. హైకోర్టువారు నిర్వహించవలసిన విధులు క్లిష్టమూ, సున్నితము అయివుంటాయి. వ్యక్తికీ వ్యక్తికీ, వ్యక్తికీ ప్రభుత్వానికీ వచ్చే తగాదాలను విచారించి న్యాయాన్ని నిర్ధారించాలి. ప్రజల జీవన్మరణ సమస్యలగూర్చి నిర్ణయాలు జరపడమేగాక రాజ్యాంగంలో నిబిడీకృతమైన ప్రజల ప్రాథమిక హక్కులు పాలింపబడేట్టు చూడాలి. ఈ కర్తవ్యమును నిష్పక్షపాతంగా పాలించుటకు న్యాయమూర్తులు స్వతంత్రముగను, నిష్పక్షపాతముగను వ్యవహరించుటకును అనువైన బాహ్యాభ్యంతర వాతావరణమును ఏర్పరచవలెననునది స్పష్టమగుచున్నది.

ప్రజాస్వామ్య ధర్మ నిర్వహణలో న్యాయ నిర్వహణ సంస్థల ప్రాధాన్యమును గుర్తించియే భారత రాజ్యాంగకర్తలు న్యాయనిర్వహణము సుష్ఠుగా జరిగేందుకు వీలుఅయిన ఏర్పాట్లను సాధ్యమయినంతవరకు కల్పించివున్నారు. రాష్ట్రపతి గవర్నరులోను, రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తితోను సంప్రదించియే భారత రాష్ట్రపతి న్యాయమూర్తులను నియమించును. వారి జీతములు ఇదమిత్థమని నిర్ణయింపబడి శాసనసభల ఓటుతో ప్రమేయము లేకుండా ప్రజలు చెల్లించు పన్నుల నుండియే ఇవ్వబడుచున్నవి. న్యాయమూర్తుల పదవీవిరమణ వయస్సు నిర్ణయింపబడినది. వారు దుర్వర్తనపరులైనారని ఋజువై పార్లమెంటువారిచే విచారింపబడి, 2/3 మెజారిటీతో శిక్ష ఖాయమైనప్పుడే తప్ప వారిని పదవులలోంచి తప్పించుటకు వీలు లేదు. న్యాయనిర్వహణలో న్యాయమూర్తులు చేయు పనులను పార్లమెంటు లోగాని రాష్ట్ర శాసనసభలోగాని విమర్శించుటకు వీలు లేదు. ఇదే లక్ష్యాన్ని దృష్టిలోవుంచుకొని వారిపట్ల కొన్ని విధులు నియమింపబడినవి. వారు పదవి నుంచి విరమించిన తర్వాత భారత దేశములో ఏ కోర్టులోను ప్రాక్టీసు చేయుటకు వీలు లేదు. రాజ్యాంగము ప్రకారము హైకోర్టు జడ్జీలుగా వారికివచ్చు జీతభత్యములుతప్ప వేరే విధముగా ఆర్జించుటకు వీలు లేదు. న్యాయమూర్తి స్వతంత్రముగను విచక్షణను ఉపయోగించి న్యాయనిర్వహణ చేయుటకు రాజ్యాంగము అవసరమైన షరతులను ఎంత విధించినను మానవసహజమైన ప్రవృత్తిని మరువలేము. ఇందుకు న్యాయమూర్తిగూడా మానవమాత్రుడే గదా! అందువల్ల న్యాయమూర్తులు న్యాయ నిర్వహణకు తమ జీవితముల సంకితము చేయవలెను. తమవద్దకువచ్చు తగాదాలను నిష్పక్షమతితో చూచి నిష్పాక్షికముగా విచారించి, ఎట్టి ప్రేరణలకు లొంగకుండా తీర్పుల నివ్వవలెను.

మన రాష్ట్రములో న్యాయ నిర్వహణ చక్కగా జరగాలంటే న్యాయవాది వృత్తిలో ఉన్నవారుగూడా పాలించవలసిన విధులు కొన్ని వున్నవి. కక్షి, పూర్వకమైన, వృథా ప్రయాసతో కూడిన తగాదాలను విసర్జించి, వ్యవహారమును క్షుణ్ణముగా ఆకళింపు చేసుకొని, సమర్థమూ, క్లుప్తము అయిన వాదనలలో శీఘ్రముగను, నిష్పక్షపాతముగను తగవులు పరిష్కారమగుటకు తోడ్పడవలెను. అల్లాగే ప్రజలుగూడా న్యాయనిర్వహణకు తోడ్పడవచ్చును. సక్రమసంఘ నిర్వహణమునకు నిర్మింపబడిన సంస్థలలో న్యాయసంస్థగూడా ఒకటని వారు మరువరాదు. ప్రజలచే సృష్టింపబడిన ఈ ఉన్నత న్యాయస్థానమునకు ఉన్నతాసనము నిచ్చినగాని వారు తమ క్లిష్టమైన విధులను నిర్వహించుట కష్టమనునది స్పష్టము. అందువల్ల చాటు మాటుగా గాని, బహిరంగముగా గాని, ఏ న్యాయమూర్తిని గూర్చిగాని, హైకోర్టును గూర్చిగాని పరుష వాక్యము లాడకుండుట అలవాటు చేసుకోవలెను. లేక, దురాలోచనతోను, అరకొర జ్ఞానముతోను, న్యాయమూర్తులను న్యాయస్థానములను విమర్శించినందువల్ల, తుదకు ఆ పదవుల సంస్థల ప్రతిష్ఠ నేలపాలు కాగలదు. న్యాయస్థానముల ప్రాధాన్యమును తగ్గించుట గాని, వాటిశక్తిని బలహీనము చేయుటగాని ఎట్టి విధముగాను యత్నించక ప్రజలు న్యాయస్థానములతో హృదయపూర్వకముగా సహకరింతురని నేను నమ్ముతున్నాను. అట్లు సహకరించనిచో తమ హక్కుల నిమిత్తము తాము నిర్మించుకొన్న సంస్థను చేజేతులా నాశనము చేసుకొన్నటుల గాగలదు. ఆంధ్రరాష్ట్ర ప్రజాస్వామ్య సంస్థల అభ్యుదయ ప్రగతిలో జూలై 5 వ తేదీని ఆంధ్రులు పర్వదినముగా పరిగణించవలెనని విన్నవించుచున్నాము.



ఆంధ్ర హైకోర్టు ప్రధానన్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావుగారు

## ఆంధ్రదేశంలో ప్రప్రథమ న్యాయస్థానం

1766 లో ఉత్తర సర్కారులు ఆంగ్లేయులకు సంక్రమించినవి. అప్పుడు ఈ ప్రాంతమంతా మచిలీపట్టణములో వున్న బ్రిటిషు కవున్సిలు ఆధీనంలో వుండేది-దీనిపై మద్రాసు కవున్సిలు.

అధికారం దుర్వినియోగం చేయడం కారణంగా, 1794 లో మచిలీపట్టణం లోని బ్రిటిషు కవున్సిలును రద్దుచేసి ఒక కలెక్టరును, జడ్జీని నియమించడం జరిగింది. ఆ రోజుల్లో ఇది "Provincial Court, Northern Division Masulipatam" అని వ్యవహరింపబడుతూ వుండేది. తర్వాత జిల్లా కోర్టులు ఏర్పాటు చేయాలని కృష్ణాజిల్లాను విశాఖపట్నం తిరిగి కలపడం-తిరిగి విడగొట్టడం జరిగి-జిల్లా కోర్టులు మునసబుకోర్టులు స్థాపించబడం జరిగింది.

1804 సంవత్సరంలో ఈ ప్రావిన్షియల్ కోర్టుకు చెందిన దస్తావేజులు నేటికి బందరుజిల్లాకోర్టులో పదిలపరచబడివున్నవి.



ఆంధ్ర హైకోర్టు భవన ముఖద్వారదృశ్యం

## స్పీకర్ల సమావేశం

### సౌరాష్ట్రలో జనవరిలో

హైదరాబాదు, జూలై 4: అన్ని రాష్ట్రాల శాసనసభల స్పీకర్ల సమావేశం ఈ సారి 1955 జనవరిలో సౌరాష్ట్రలో జరుగగలదని తెలుస్తోంది. (స్వ. వి.)

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ ఆషాఢ శు॥ పంచమి 1954 సం॥ జూలై 5 సోమవారం పోకపంచమి 14-49 పూఫ రా 4-30 వర్జ్యం 11-23 ల రా 1-5కు.

శు॥ షష్ఠి జూలై 6 మంగళవారం శుం॥ షష్ఠి 16-7 ఉఫ పూ త్తి 24-0 వర్జ్యం 12-23 ల 14-7 కు.



ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్ - (మహాభారతము)

శ్రీ జయ సం॥ ఆషాఢ శు॥ పంచమి సోమవారం

## హైకోర్టు

అక్టోబరు 1 తర్వాత, అంత ముఖ్యమైన రోజు జులై 5. అక్టోబరు 1 వ తేదీన ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. నేడు, రాష్ట్రానికి ప్రధానాంగమైన, హైకోర్టు ఏర్పడుతున్నది. ప్రత్యేక రాష్ట్రంతో బాటే ప్రత్యేక హైకోర్టుకూడా ఏర్పడవలసింది. ప్రత్యేక రాష్ట్ర స్థాపన, ప్రత్యేక న్యాయస్థాన స్థాపన కార్యక్రమాలను ఏక కాలంలో నిర్వహించడం సులభంగాదని భారత ప్రభుత్వం 1956 జనవరి 1 లోగా ఆంధ్రకు ప్రత్యేక న్యాయస్థానం ఏర్పడగలదని ప్రకటించింది. ఆంధ్ర ప్రజాప్రతినిధులు కోరేపక్షంలో ఆలోగానే ఆంధ్రకు ప్రత్యేక హైకోర్టును స్థాపింప గలమని కేంద్ర ప్రభుత్వంవారు స్పష్టం చేశారు.

ఆంధ్ర ప్రజా ప్రతినిధులు మార్చి 1 వ తేదీన ఆంధ్ర రాష్ట్రానికి 1954 జులై 5 నుంచి ప్రత్యేక హైకోర్టు ఏర్పడాలని తీర్మానించారు. హైకోర్టు కార్యస్థానం గుంటూరులో ఏర్పాటు కావాలని ఆ తీర్మానంలో వారు స్పష్టం చేశారు. హైకోర్టు స్థాపనకు సంబంధించిన తొలి నిర్ణయాలు జరిగిన పరిస్థితులను పరిశీలించితే ఆంధ్ర హైకోర్టు ఆదర్శ న్యాయస్థానంగా వర్ధిల్ల గలదనే విశ్వాసం కలుగుతుంది.

మద్రాసు హైకోర్టుకు కొత్త న్యాయమూర్తులను నియమించే సందర్భంలో మద్రాస్ రాష్ట్ర ప్రభుత్వంగాని, కేంద్ర ప్రభుత్వం గాని ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వాభిప్రాయాన్ని తెలుసుకోలేదు: ఇది సక్రమమైన పద్ధతి గాదనీ, మద్రాస్ హైకోర్టుకు ఆంధ్ర న్యాయమూర్తిని నియమించే విషయంలోనైనా ఆంధ్ర ప్రభుత్వాన్ని సంప్రతించడం న్యాయమని ఆంధ్ర మంత్రివర్గం అభిప్రాయపడింది. వెంటనే ఆంధ్ర రాష్ట్రానికి ప్రత్యేక న్యాయస్థానం 1954 జులై 5 నుంచే ఏర్పాటు కావాలని నిర్ణయించినది.

అయితే హైకోర్టు కార్యస్థానం విశాఖపట్నంలో ఏర్పాటు కావాలని మంత్రివర్గం తీర్మానించింది. విశ్వకళాపరిషత్తు కేంద్రకార్యస్థానంవున్న పట్నంలోనే హైకోర్టు కార్యస్థానాన్ని నెలకొల్పడం న్యాయంగాదని ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు భావించి ప్రభుత్వ ప్రతిపాదనను త్రోసివేసి గుంటూరులోనే హైకోర్టు ఏర్పాటు కావాలని తీర్మానించారు. గుంటూరులో ఆంధ్ర హైకోర్టు 1954 జులై 5 నుంచి ప్రారంభం కావాలనే తీర్మానం ఒక్కవోటు మెజారిటీతోనే నెగ్గింది. అందువలననే న్యాయం, ధర్మం జయించగలదనే విశ్వాసం కల్గింది.

కేంద్రప్రభుత్వ హోం శాఖామంత్రి డా॥ కట్జూగారు ఆంధ్ర హైకోర్టుకు ప్రారంభోత్సవం చేయుడం అన్నివిధాలా బాగున్నది. వారు ప్రసిద్ధ న్యాయవాది. న్యాయశాస్త్రవేత్త, ఆంధ్ర రాష్ట్ర శాసనాన్ని తయారుచేసి రాష్ట్రాన్ని నెలకొల్పినారు. ఆంధ్రరాష్ట్రానికి ప్రధాన మంత్రి నెహ్రూ ప్రారంభోత్సవం చేయడం ఎంత సముచితంగానూ సమంజసంగానూ వున్నదో హైకోర్టుకు డా॥ కట్జూగారు ప్రారంభోత్సవం చేయుడం అంత సముచితంగానూ, సమంజసంగానూ వున్నది.

మన హైకోర్టు న్యాయమూర్తులు ముగ్గురూ ఇంతవరకూ మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తులుగావుండి తమ విధులను, బాధ్యతలను అత్యంత సమర్థతతో, అందరి మన్ననలకూ పాత్రులై నిర్వహించినారు. ప్రధాన న్యాయమూర్తి కోకా సుబ్బారావుగారు ఆంధ్ర హైకోర్టు ప్రత్యేకాధికారిగా హైకోర్టు స్థాపనకు సంబంధించిన కార్యక్రమాన్ని రెండు మాసాల్లో పూర్తిచేశారు. వారి కార్యదక్షతకు, సామర్థ్యానికి, విచక్షణాశక్తికి నేడేర్పడుతున్న న్యాయస్థానమే ప్రత్యక్ష నిదర్శనం.

ఆంధ్ర న్యాయవాదులు దేశంలోని ఇతర న్యాయవాదులకు సరిసమానులే. మద్రాస్ హైకోర్టులో విశేష పేరుప్రఖ్యాతులను సంపాదించిన ఆంధ్ర న్యాయవాద ప్రముఖులు ఎందరో వున్నారు. హిందూ ధర్మశాస్త్రానికి టీకా తయారు చేసినవారు స్వర్గీయ రెంటాల వెంకట సుబ్బారావుగారు. మద్రాస్ హైకోర్టులో అగ్రశ్రేణికి చెందిన న్యాయవాదులలో ఆంధ్రులెందరో గలరు. బుర్రా సత్యనారాయణ, వింజమూరి గోవిందరాజాచారి, చింతగుంట రాఘవరావు, ప్రభృతులు చిరస్మరణీయులు. ఆశ్రేణికి చెందినవారు ఈనాటికీ మనతో వున్నవారు ప్రకాశం పంతులుగారు, ప్రత్తిపాటి సత్యనారాయణ రావుగారు, మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పి. వి. రాజమన్నార్, సుప్రీంకోర్టు న్యాయమూర్తి జగన్నాథ దాస్ ప్రభృతులు.

మద్రాస్ హైకోర్టుకు ప్రప్రథమ భారతీయ ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారని గ్రహించిన ప్రతిఆంధ్రుడు గర్వపడగలడు. మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తులుగ నున్న ఆంధ్రులు పన్నెండు మంది. ప్రప్రథమ ఆంధ్ర న్యాయమూర్తి సర్ వేపా రామేశంగారు.

ఆంధ్ర హైకోర్టు అవతరణోత్సవ సందర్భమున నేడు మేము ప్రచురిస్తున్న ప్రత్యేక సంచికలో రాష్ట్రంలోని న్యాయవాద సంఘాల చరిత్రను సాధ్యమైనంత సమగ్రంగా ప్రచురించడానికి ప్రయత్నించాము. లోపాలున్నవి. కొన్ని ప్రాంతాలలోని న్యాయవాద సంఘాల వివరాలు అఖరుక్షణం వరకూ అందని కారణంగా ఇంగుకు సంబంధించిన వివరాలు అసమగ్రంగా వున్నవి.

ప్రధాన న్యాయమూర్తి గౌరవనీయులు శ్రీ కోకా సుబ్బారావుగారు ఆంధ్రప్రజానీకానికి పత్రికద్వారా ఇచ్చిన సందేశం అందరికీ శిరోధార్యం. మద్రాస్ హైకోర్టులోని ప్రథమ ఆంధ్ర న్యాయమూర్తి సర్ వేపా రామేశంగారు ప్రప్రథమ భారతీయ, ఆంధ్ర న్యాయమూర్తి గౌరవనీయులు శ్రీ పాకాల వెంకట రాజమన్నార్ గార్లు ఈ సంచికకు వ్రాసిన వ్యాసాలు అన్ని వర్గాలవారికీ కర్తవ్యాన్ని బోధిస్తున్నవి.

ఈ ప్రత్యేక సంచిక ప్రచురణకు వ్యాసాలను పంపి, చిత్రపటములను పంపి ఈ మా ప్రయత్నాన్ని ఫలప్రదం చేసిన వారందరికీ మా కృతజ్ఞతాభివందనాలు.

## ఈతిబాధలు పడలేక ఆత్మహత్య

### ఢిల్లీలో విషాద సంఘటన

న్యూఢిల్లీ, జూలై : కేంద్ర సచివాలయంలో విద్యాశాఖకు చెందిన ఒక ఉద్యోగి ఇవాళ ఉదయం సచివాలయ ఉత్తరపు భవనంపై అంతస్తుపై నుంచి క్రిందకి దుమికి ఆత్మహత్య చేసుకున్నాడు.

ఈయన పేరు మెహర్ చంద్.

ఉదయం 8-30 గంటలకి వచ్చిన్నగా భవనంపైకి ఎక్కిపోయి తటాలున దూకివేశాడట. క్రింద పడిన ఉత్తర క్షణంలోనే ప్రాణాలు పోయాయి.

ఈయన జేబులో పోలీసులకి ఒక ఉత్తరం దొరికింది.

సంసార సంబంధమైన వేదనలు భరించలేక ఆత్మహత్య చేసుకోడానికి నిశ్చయించుకున్నానని అందులో వ్రాయబడి ఉంది.

## ఆంధ్ర శాసనసభ గ్రంథాలయం

### అమెరికా ప్రభుత్వ బహూమానం

కర్నూలు, జూలై 3: అమెరికా 178 వ స్వాతంత్ర్యోత్సవం సందర్భంలో న్యాయశాస్త్రం, ప్రభుత్వం, శాసనసభా కార్యక్రమ నిర్వహణ విషయాలకు సంబంధించిన రెండువందల ఎనభై గ్రంథాలను అమెరికా ప్రభుత్వంవారు ఆంధ్రశాసనసభకు బహూకరించారు.

ఈ గ్రంథాల బహూకరణోత్సవం సందర్భంలో మద్రాసులోని అమెరికా కౌన్సలేట్ జనరల్ హెన్రీ సి. రామ్సేగారు ఈ దిగువ ప్రకటన చేశారు:

"అతి ముఖ్యమైన ఈ గ్రంథాలను అమెరికా ప్రజలతరపున ఆంధ్రప్రజల ప్రతినిధులయిన ఆంధ్ర శాసనసభ్యుల వినియోగార్థం ఆంధ్రశాసనసభా గ్రంథాలయానికి చాలా సంతోషంగా బహూకరిస్తున్నాను. ఇవి మీకు బాగా ఉపయోగపడగలవని ఆశిస్తున్నాను. నా దేశం 178 వ స్వాతంత్ర్యోత్సవం సందర్భంలో ఈ పుస్తకాల నిజమైన సందేశం మీకు అందచేయ్యడం నాకు ప్రత్యేకంగా ఆనందంగా వున్నది."

ఈ బహూకరణకు కృతజ్ఞతాభివందనలు తెలుపుతూ ఆంధ్రశాసనసభ స్పీకరు ఈ క్రింది ప్రకటన చేశారు:

"ఈ బహూకరణ గ్రంథాలలో మెక్ కిన్నీ వ్రాసిన న్యాయోద్యుక్త చట్టాలసంపుటి, అమెరికా కోడ్, సెనేట్ మాన్యుయల్, జఫర్సన్ వ్రాసిన మాన్యుయల్, ప్రజాసభకు లోగడ అధ్యక్షులుగా పనిచేసినవారి చరిత్రల 11 విభాగాల సంపుటి, వివిధరాష్ట్రాల రాజ్యాంగాలు, అమెరికా మాజీ అధ్యక్షుడు హెర్బర్ట్ హూవర్సన్, కార్యనిర్వహణశాఖ పునర్ వ్యవస్థీకరణ మొదలయిన గ్రంథాలున్నవి. సుప్రీమ్‌కోర్టు మాజీ న్యాయమూర్తి ఛార్లెస్ ఇవాన్స్ హ్యూస్, బెంజమిన్, కార్డోజో వ్రాసిన గ్రంథాలుకూడా వున్నయ్. అమెరికాలో అమలులోవున్న శాసనసభా కార్యక్రమ నిర్వహణ వ్యాఖ్యలు కూడా వున్నయ్. "లెజిస్లేటివ్ స్ట్రగిల్-ఎ స్టడీ ఇన్ సోషల్ కంబాట్" అనే గ్రంథం ఒకటి ఉన్నది. జాన్ ఎస్. స్లెసింజర్ వ్రాసిన "అమెరికన్ సిస్టమ్ ఆఫ్ గవర్నమెంట్," ఇ. ఎస్. కార్విన్ వ్రాసిన "అండర్ స్టాండింగ్ ది కాన్స్టిట్యూషన్" అనే గ్రంథాలు కూడా వున్నయ్.

"అమెరికన్ కాన్సలేట్ జనరల్‌కు ఆంధ్రశాసనసభ స్పీకరు ప్రత్యేకాభివందనాలు తెలియచేస్తూ ఈ బహూకరణ ఆంధ్రశాసనసభా గ్రంథాలయానికి లభించే విషయంలో ఇదివరకటి అమెరికా కాన్సలేట్ జనరల్ జే. ఆల్ఫ్రెడ్ లిగ్రాంజీ, ఇప్పటి అమెరికా కాన్సలేట్ జనరల్ హెన్రీ సి. రామ్సే గారలకు కృతజ్ఞతా వందనాలు తెలుపుకున్నారు."

# మద్రాస్ హైకోర్టు... పూర్వస్మృతులు

1862 కు పూర్వం మద్రాసు రాష్ట్రంలో సదర్ అదాలత్ (సదరు కోర్టు) ఉండేది. అయితే దాన్ని 1862 లో మద్రాసు హైకోర్టుగామార్చారు. అందులో రంగయ్య నాయుడుగారు అనే ఆయన ఉండేవారు. శ్రీ నాయుడుగారే మహాజన సభకు అధ్యక్షులుగా పనిచేసేవాడు. సదర్ అదాలతోను హైకోర్టుగా మార్చినప్పుడు సదరు సదర్ అదాలత్‌లో ప్లీడర్లుగా పనిచేస్తున్న వాళ్ళంతా హైకోర్టు ప్లీడర్లుగా మారారు. ఆ తరువాతనుంచీ లా గ్రాడ్యుయేట్లను హైకోర్టు వకీళ్లుగా నియమించడం ప్రారంభమైనది.

*　*　*

ఇట్టి గ్రాడ్యుయేట్లలో మొట్టమొదటి గ్రాడ్యుయేటుకూడా తెలుగు ఆయనే, రాజా రుమ్మలపల్లి రామారావుగారు. వారు గోల్కొండ వ్యాపారులు, ఆ రోజుల్లో ఈయనకు మంచి ప్రాక్టీసు ఉన్నదని చెప్పుకునేవారు. అడ్వొకేట్లసంఘం మొట్టమొదట ఏర్పడ్డప్పుడు శ్రీ రాజావారే దానికి ప్రథమాధ్యక్షులుగా పనిచేశారు. వీరు 1869 ప్రాంతాల్లో హైకోర్టు వకీలుగా "ఎన్రోలు" అయినారు.

*　*　*

1881 ఆ రోజుల్లో వ్యవహారం చూస్తే ఆంధ్రులకుగాని ద్రవిడులకుగాని విస్తారం ప్రాబల్యం ఉన్నట్లు కనిపించదు. ఈ రెండుతరహాల వకీళ్లు ఆ రోజుల్లో తక్కువే. చెంగల్పట్టుజిల్లా వాస్తవ్యులకు హైకోర్టు ఆటపట్టయిపోయింది. భాష్యం అయ్యంగారు, రామచంద్రరావు సాహెబ్, పి. జి. కృష్ణస్వామి చెట్టి, ఈ కోవవారంతా ఉండేవారు. సౌందర్యమహల్ కట్టించిన సాలా గురుస్వామి చెట్టిగారు, సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారి మామగారు, సుబ్బయ్య చెట్టిగారుగూడా ఆ రోజుల్లో చాలా ప్రసిద్ధులు. ముత్తా వెంకటసుబ్బారావుగారి మామగారులాయరుగాదు; అటర్నీ. ఆయనకు రెండు చేతులా పని ఉండేది. విక్టోరియా గుర్రపుస్వారీచేసుకొని ప్రైభోగంగా కోర్టుకు వచ్చేవారు. మిగతావారంతా యూరోపియన్లు, నార్టన్, సల్లివన్, గ్రాంటు, ప్రభృతులు ఆ రోజుల్లో ముఖ్యులు.

*　*　*

1892 ప్రాంతాల్లో మధురజిల్లాజెడ్జి హచ్చిన్సుగారు మద్రాసు హైకోర్టు జడ్జీ అయినాడు. ఎస్. సుబ్రహ్మణ్య అయ్యరు మధురనుంచి మద్రాసుకు వచ్చారు. హైకోర్టులో వకీలుగా ప్రాక్టీసు ప్రారంభించారు. అప్పటినుంచీ ద్రావిడుల ప్రాబల్యం ప్రారంభమైంది. 1892 లో ఈ ప్రాభవ ప్రారంభం 1900 వరకు అవిచ్ఛిన్నంగా కొనసాగింది.

*　*　*

1897 లో శ్రీ పురాణం నాగభూషణంగారు మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు పెట్టారు. 1900 లో నేనూ, పేరి నారాయణమూర్తిగారు, కంటి లక్ష్మన్నగారు ఇంకా అనేకులం మద్రాసు చేరాము. అంతకుపూర్వం నేను నాళ్లేళ్లపాటు విశాఖపట్నం జిల్లా కోర్టులో ప్రాక్టీసు చేశాను. తర్వాత హైకోర్టుకు వచ్చాను. 1902-1903 ప్రాంతాల ముత్తా వెంకటసుబ్బారావు, వికలదేవుని రాధాకృష్ణయ్యగారలు వచ్చారు. 1907 లో అల్లాడి కృష్ణస్వామయ్యగారు వచ్చారు. 1911 లో బి. ఎన్. శర్మ, వేమవరపు రామదాసు పంతులు న్యాయవాదులుగా వచ్చారు. 1917 లో ఇప్పుడు సుప్రీంకోర్టుజడ్జీగా ఉన్న బచ్చు జగన్నాథదాసు, కల్యూరి సూర్యనారాయణగారలు చేరారు. వీరిద్దరు నాక్రింద అప్రెంటిసులుగా ఉన్నారు. తర్వాత ఏడు బుర్రా సత్యనారాయణ హుమ్యాంశాస్త్రిగారలు చేరారు. వారు నాదగ్గిర అప్రెంటిసులుగానే చేరారు.

*　*　*

హుమ్యాంశాస్త్రిగారిని గూర్చి ఒక కథ ఉంది. వీరి పేరు ఉండే శాస్త్రి ఉండొచ్చుగాని ఈ హుమ్యాంశాస్త్రి అనేది ఏమిటని అందరికీ ఆశ్చర్యంగా ఉండేది. హైకోర్టు జడ్జీలలో ఒక ఇంగ్లీషు ఆయనకు మరీ ఆశ్చర్యం కలిగింది. ఆయన వన్నడిగారు. ఈ హుమ్యాంశాస్త్రి ఏమిటని? నేను చెప్పాను—వారి తండ్రి పదహారణాల జాతీయవాది కాంగ్రెసువాది. కాంగ్రెసును స్థాపించింది హ్యూమ్‌దొర. ఆయన పేరు తన కొడుక్కు పెట్టుకొని ఆ జాతీయ సంస్థను, సంస్థాపకుణ్ణి గూడా గౌరవించడం ఆయన భావం. అందుకని హుమ్యాంశాస్త్రి అని పేరు పెట్టాడు అని. ఆయన ఆశ్చర్యగా అన్నారు.

*　*　*

ఇంతమంది ఆంధ్రులు హైకోర్టుకు ప్రవేశించినా చేదాక తెలుగుదేశం ప్రాక్టీసు అంతా అటునుంచి ఇటు తిరిగింది. ఇంకా ఎంతో తెలుగుదేశం ప్రాక్టీసు తెనుగువాళ్ళ పరంగా నడిచింది.

> సర్ వేపా రామేశం ప్రస్తుతం వయోవృద్ధులు, 1954 జులై నాటికి ఆయనకు 79 వెళ్లి 80 వ ఏడు వస్తుంది. ఆయన పుట్టిన నెలలోనే ఆంధ్రహైకోర్టు ఏర్పడుతోంది. ఆంధ్రుల్లో ప్రథమంగా హైకోర్టు న్యాయమూర్తి పదవిని అందుకొన్న సర్ రామేశంగారు పుట్టిన నెలలో హైకోర్టు స్థాపన జరగడం వారికి గర్వకారణంగా ఉన్నది. రామేశంగారు 1896లో మద్రాసు లాయరుగా ఎన్రోలయ్యారు. 1900 లో మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు పెట్టారు. 1920 లో హైకోర్టు న్యాయమూర్తి అయ్యారు. 1935 లో రిటైరైనారు.

### సర్ వేపా రామేశం రిటైర్డ్ హైకోర్టు జడ్జి

1919 నాటికే ఆంధ్ర-ద్రవిడ తారతమ్యాలు పొడసూపాయి. సర్ బి. ఎన్. శర్మగారు ఈ రోజుల్లోనే ప్రత్యేకాంధ్ర రాష్ట్రంయొక్క ఆవశ్యకతను గూర్చి ఆలోచనలు బాగా ప్రారంభించారు. ఆంధ్రరాష్ట్రం వస్తేనేగాని తెనుగువాళ్ళకు విమోచనలేదని ఆయన నాతో అంటూ ఉండేవాడు. 1920 నవంబరులో నేను, 1921 శ్రీ ముత్తా వెంకటసుబ్బారావుగారూ హైకోర్టు జడ్జీలముగా వచ్చాము. సుబ్రహ్మణ్యం అయ్యరు, భాష్యం అయ్యంగారలు జడ్జీలుగా ఒకే బెంచిలో ఉన్నప్పుడు అరవంలో మాట్లాడుకుంటూ వుంటే అంతా వింటూండేవాళ్ళం. అట్లాగే నేను సుబ్బారావుగారు తెనుగుమాట్లాడుతూ ఉండేవాళ్ళం. 1935 లో నేను విరమించాను. నాతర్వాతనూ తేశ్ళకు ఆయన విరమించారు.

*　*　*

సుబ్బారావుగారు ఆరోజుల్లో ఇచ్చిన తీర్పుల్లో విజయనగరం మహారాజా వారి పిల్లలనుగూర్చిన తీర్పును చాలా గొప్పదిగా చెప్పుకుంటారు. మహారాజా వారి పిల్లల్ని కోర్టు ఆఫ్ వార్డ్సు వారు గార్డియన్‌షిప్‌చేస్తూ లండను పంపించడానికి ఆలోచన జరిగింది. మహారాజావారు అభ్యంతరం చెప్పారు. తన అనుమతిలేనిదే తనపిల్లలను ఎల్లా పంపించడం అన్నారు. ఇది హైకోర్టుకు వచ్చింది. కోర్టు ఆఫ్ వార్డ్సు అంటే అంతా రెవిన్యూబోర్డు. అదంతా యింగ్లీషు పెద్దలమయం. ఈ కేసు సుబ్బారావుగారిముందు విచారణకువచ్చింది. సుబ్బారావుగారు తీర్పు యిచ్చారు. తండ్రియొక్క అనుమతిలేనిదే పిల్లల్ని లండను పంపించడానికి ఏకోర్టుఅంగీకరించదని. ఈ తీర్పును ఇప్పటికీ చాలా గొప్పగా చెప్పుకుంటారు.

ఆగోజుల్లోనే అన్నామలైచెట్టిగారిపై వచ్చిన రూ 95 లక్షల దావాను గూర్చిగూడా విచారణ జరిగింది. దాన్ని నేనే మధురకోర్టునుంచి హైకోర్టుకు ట్రాన్సుఫర్ చేశాను. దాని మీద అప్పీలువచ్చింది. అప్పీలు విచారణ సుబ్బారావు ప్రభృతులముందు వచ్చింది. వారు నాట్రాన్సుఫర్ ఉత్తర్వును ఖాయంచేశారు. ఇదికూడా ఆ రోజుల్లో చాలాగొప్పకేసుల్లో ఒకటి.

*　*　*

సుబ్బారావుగారిని గూర్చి అంతా చెప్పుకోవడమేగాని ఆయన ఎక్కడ పుట్టింది, ఎక్కడ పెరిగిందీ చాలామందికి తెలియదు. ఆయన పశ్చిమ గోదావరిజిల్లా అత్తిలిలో పుట్టారంటే అందరు అల్లాగా అంటారు. ఆయన అత్తిలిలో పుట్టారు. 9 ఏళ్లు వచ్చేదాక ఆక్కడే చదువులేదు. కాకినాడలో అంతవరకు ఆయన పెరిగారు. ఆ బొమ్మదేశ్ళలోను వారిని పెంచినవారు వారి చేతి సులక్షణసారము పెద్దబాలశిక్ష మొదలైన గ్రంథాలు చదివించారు. అప్పుడు వారిని మద్రాసులో న్యాయవాదిగానున్న సుబ్బయ్య చెట్టిగారు తీసుకువచ్చి, ఆదరించి, పోషించి చదువుచెప్పించి, పిల్లనిచ్చి పెళ్లిచేశారు. ఆ న్యాయవాది వృత్తినే సుబ్బారావుగారు అవలంబించి హైకోర్టు జడ్జి అయి, కొంతకాలం ప్రధాన న్యాయమూర్తిగాగూడా పనిచేసి ప్రసిద్ధిగాంచారు.

*　*　*

మా తర్వాత మద్రాసు హైకోర్టులో తెనుగు న్యాయమూర్తుల పరంపర పెరిగింది. పాకాల వెంకటరమణరావు నాయుడుగారు, బి. సోమయ్యగారు, వింజమూరి గోవిందరాజాచారి, ప్రత్తిపాటి సత్యనారాయణ, చింతగుంట రాఘవరావు, కోకా సుబ్బారావు, పలగాని చంద్రారెడ్డి, కొండుబంట ఉమామహేశ్వరం ప్రభృతులు న్యాయమూర్తి పదవులను అందుకున్నారు. మద్రాసు హైకోర్టు ప్రస్తుత ప్రధాన న్యాయమూర్తి శ్రీపాకాల రాజమన్నారుగారు పాకాల వెంకటరమణరావు నాయుడుగారి సుపుత్రులు. న్యాయశాస్త్ర పాండిత్యంలో మంచి అందెవేసిన చేయి. సాహిత్యంలో మంచి ప్రవేశం గలవారు. ఆయన తండ్రిని మించిన కొడుకు.

*　*　*

ఆ రోజుల్లోను ఈ రోజుల్లోనూ గూడా న్యాయవాదులంతా ఏక కుటుంబంగానే, సుఖంగా కాలం గడపటం ఉంది. భాషా భేదాలు, ప్రాంతీయ భేదాలు అల్లాగే ఉండేవి. అవి అవే. స్నేహం స్నేహంగానే ఉండేది. అయితే కేరళులకు తెనుగులకు, ఉన్న సాన్నిహిత్యం పూర్వమైంది. ఆంధ్ర ద్రావిడ సాన్నిహిత్యంకన్న ఆంధ్ర కేరళ సాన్నిహిత్యం చెప్పుకో దగిందిగా ఉండేది. కేరళులలో శంకరన్ నాయర్, మాధవన్నాయరు గారలు ప్రసిద్ధులు. శంకరన్నాయరుగారు 1907 లో న్యాయమూర్తి అయ్యారు. సుబ్రహ్మణ్యం అయ్యరుగారి స్థానంలో ఆయన వచ్చారు. ఎనిమిదేళ్లు మద్రాసులో ఉన్నారు. తిర్వాత ఢిల్లీలో కౌన్సిలులో మెంబరుగా వెళ్లారు. ఛెమ్స్‌ఫర్డ్ గవర్నరు జనరల్‌గా ఉండగా జలియన్ వాలాబాగ్ హత్యలు జరిగినయి. శంకరన్నాయరుగారు కౌన్సిలులో తమ పదవికి రాజీనామా ఇచ్చారు. అయితే ఛెమ్స్‌ఫర్డ్ ఆయన్ను లండనులో సెక్రటరీ ఆఫ్ స్టేట్ సలహా సంఘంలో సభ్యులుగా నియమించ వలసిందిగా సిఫార్సు చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం ఆజ్ఞ చేసింది. ఈయన లండనులో అడుగు పెట్టాడు. అక్కడ ఓడయ్యరు ఈయనమీద పరువునష్టం దావా వేసి వారంటు చేతికందించాడు. ఇదో విచిత్రమైన ఉదంతం. ఓడయ్యరు సంజాబులో అమృతసర్‌లో జలియన్ వాలాబాగ్‌లో సభ జరుపుకుంటున్న జనం మీద నిర్దాక్షిణ్యంగా బాంబులువేసి తుపాకులు కాల్పించి దంపించాడు. ఈ ఉదంతాన్ని గూర్చి వ్రాస్తూ సర్ శంకరన్ నాయర్ 'ఓడయ్యరు దొంగలాగపంజాబునుంచి దాటుకుపోయ్యా' డని ఇండియాలో ప్రచురించారు. ఓడయ్యరు లండనులో పరువు నష్టం దావా వేశాడు. ఛెమ్స్‌ఫర్డు ఈయన్ను సలహాదారుడుగా పంపించాడు. ఈ కేసువల్ల ఆయన చాలా వ్యయప్రయాసలకు లోనయ్యాడు. ఓడయ్యరుతో వ్యవహారం 500 పౌన్లతో పరిష్కారమైంది. శంకర్ నాయరు గారి కైన ఖర్చు అపరిమితం. మాధవన్నాయరుగారు శంకర్ నాయరుగారి అల్లుడే. ఆయన ప్రీవీకౌన్సిలు మెంబరు గూడా అయ్యారు.

*　*　*

ఆంధ్రులకు ప్రత్యేకంగా హైకోర్టు ఏర్పడాలని మేము కన్న కలలు 1954 జూలై 5 నాడు సఫలం అవుతున్నవి. ఆంధ్రులే న్యాయమూర్తులుగా, ప్రధాన న్యాయమూర్తులుగా ఉండే హైకోర్టు ఆంధ్రులకు ప్రాప్తిస్తున్నది. భగవంతుని ఆశీర్వచనంతో న్యాయమూర్తులు ధర్మంతో, న్యాయంతో, నిష్పక్షపాతంతో వ్యవహరించి ఆంధ్రహైకోర్టును వర్ధిల్లచేస్తారని ఆశిస్తున్నాను. అటువంటి శక్తి వారికిమ్మని, ఆంధ్రహైకోర్టును ఆదర్శ న్యాయస్థానంగా వర్ధిల్ల చేయవలసిందని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. దేశంలో న్యాయం, ధర్మం, నిష్పక్షపాతం వర్ధిల్లేందుకు అందరూ కృషి చేయాలని, అల్లా వాళ్లకు తగినశక్తి ప్రసాదించవలసిందిగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

## 7 రాష్ట్రాల స్థానిక మంత్రుల సభ

### ఏర్పాటు చేస్తున్నట్లు తిమ్మారెడ్డిగారి ప్రకటన

కర్నూలు, జూలై 3: మద్రాసు, హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్, కూర్గు రాష్ట్రాల స్థానిక పరిపాలనా శాఖమంత్రుల సభా వేశాన్ని వచ్చే నెలలో యేర్పాటు చెయ్యాలనుకొంటున్నామని ఆంధ్ర ప్రభుత్వ స్థానిక పరిపాలనాశాఖమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డిగారు నేడు ఇక్కడ అన్నారు.

స్థానిక పరిపాలనా నిర్వహణ వ్యవస్థల పునర్నిర్మాణానికి సంబంధించిన అన్ని విషయాలను గురించి ప్లానింగు కమిషన్‌తో చర్చించడానికిగాను ఇటీవల సిమ్లాలో జరిగిన స్థానిక పరిపాలనా శాఖమంత్రుల సమావేశం నియమించిన సంఘంలో తిమ్మారెడ్డిగారు ఒక సభ్యుడు.

ఈ సందర్భంలో ఆయన యింకా ఇలా చెప్పారు:

"స్థానిక పరిపాలనా నిర్వహణ వ్యవస్థలు ఎదుర్కొంటున్న సమస్యలను ప్లానింగు కమిషనుకు తెలియచెయడానికి వీలుగా ఆయా సమస్యలన్నింటిని గురించీ యీ సమావేశం చర్చించుతుంది. పురపాలక సంఘాలు తమతమ ప్రాంతాలలో పంపులద్వారా నీళ్ళసప్లయి చేయించే ప్రణాళికలను అమలు జరపడానికిగాను తేలిక వాయిదాలలో తిరిగి చెల్లించే పద్ధతిలో పురపాలక సంఘాలకు అప్పులు ఇవ్వడానికి కేంద్ర ప్రభుత్వమూ, కేంద్ర ఆరోగ్య శాఖామంత్రిణి రాజకుమారి అమృత కౌరుగారూ అంగీకరించారు. గ్రామ పంచాయతీలలో పాటు పైదొలగి, పరిపాలనా నిర్వహణకు ముఖ్యమయిన యూనిట్లుగా అవి రూపొందడానికి వినియోగపడే అతిముఖ్యమయిన నిర్ణయాన్ని స్థానిక పరిపాలనా శాఖ మంత్రుల సమావేశం చేసింది. తగాదాలను త్రిగ్గించడానికి వీలుగా రాజీలు కుదిర్చే సంఘాలను ఏర్పాటు చెయ్యాలని ఆసమావేశం చేసిన సూచన ప్రశంసనీయమైనది. పంచాయతీలకు న్యాయ నిర్ణయాధికారాలు ఇవ్వాలని ఆసమావేశం చేసిన నిర్ణయం కూడా సంతోషించ దగినది.

## మఠాదాయ ధర్మాదాయాల చట్టం

### గవర్నరు ఆమోదం

కర్నూలు, జూలై 2: 1954 లో హిందూ మఠాదాయ ధర్మాదాయాల చట్టానికి మూడవ సవరణ చేస్తూ ఆంధ్ర శాసనసభ ఆమోదించిన బిల్లును ఆంధ్ర గవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదీ ఆమోదించారు. 1951 లో అమలు జరుపబడిన మద్రాసు రాష్ట్ర మఠాదాయ ధర్మాదాయాల చట్టానికి ఈ బిల్లు కొన్ని సవరణలు చేస్తున్నది. ప్రధాన చట్టంలోని కొన్ని లక్ష్యాలు నెరవేరడానికిగాను నిధిని ఏర్పాటు చెయ్యడానికి ఈ బిల్లులో ఒక క్లాజును ఏర్పాటు చేశారు.

# ధర్మ మూర్తులు

### 'అంగీరస'

ప్రాచీనకాలంలో న్యాయనిర్వహణం కేవలం నిరంకుశాధికారం చలాయించడం కాదని చరిత్రకారులనేకులు ఉద్ఘోషిస్తూంటారు. ఈ ధర్మ నిర్వహణాని కాయాకాలాల్లో అనేక ప్రణాళికలనుసరిస్తూంటేవారు.

రాజాధిరాజులు, చక్రవర్తులు ఎంతెంతటి అధికారాలు హస్తగతం చేసుకున్నా ధర్మ నిర్వహణంలో మాత్రం వీరి అధికారం చాలా పరిమితమయిపోయేది. ఎవరైనా ఒకరు ఈ ధర్మాతిక్రమణంచేస్తే వారికి పను వెంటనే రాజ్యభ్రంశమే. వేనరాజు కథ దీనికి చాలా చక్కని ఉదాహరణం.

మనువు మొదలైన మహర్షులు ఆయా కాలాల కనుగుణంగా ధర్మశాస్త్రాలు రచించినా ఈ ధర్మ నిర్ణయమనేది గ్రంథస్థ విషయమే అని ప్రాచీను లెవరూ అంగీకరించినట్లు కనబడదు. సంఘంలో ఆదర్శ జీవితంలో సంచరించిన ఉత్తమ పురుషుల జీవిత చర్యకు కూడా ప్రాచీనులు ధర్మశాస్త్ర ప్రామాణ్యం కల్పించినట్టు కనబడుతున్నది. అయితే ఉత్తమ పురుషుల జీవితాలు ధర్మ శాస్త్రాలు అవగాహన చేసుకొన్నంత మాత్రాన సర్వులకు ధర్మ నిర్ణయంచేసే అధికారం ఉండేది కాదు. అటికీ అధర్మ నిర్ణయం చేసే వ్యక్తి కూడా కులపెద్దలందరి గౌరవాన్గ్రుపయితేనే అతని మాక్కి అందరూ శిరసా వహించేవారు. వేదవేదాంగ ధర్మ శాస్త్రాలు, శిష్టాచారము, పరిశీలించి శిష్టులు చేసే నిర్ణయమే సర్వులకు శిరోధార్యంగా ఉండేది. ఇలాగ ధర్మ నిర్ణయం చెయ్యడం అంత తేలిక కాదు. కనకనే ప్రాచీనులు 'ధర్మస్య తత్వం నిహితం గుహాయామ్' అంటే ధర్మసూక్ష్మం చాలా నిగూఢమైనది అని ప్రవహించారు. ఈ ధర్మ సూక్ష్మం తెలిసిన వ్యక్తి-పరిషత్తులలో నియమిస్తే దేశందా అందరు ఆ వ్యక్తిని గౌరవించేవారు. భారతంలో ధర్మవ్యాధోపాఖ్యానం ఈ విషయం బాగా బుజువు పరుస్తున్నది.

రామాయణకాలం మొదలుకొని నేటి కాలం వరకు ఇలాంటి ధర్మ ప్రవక్తలు ధర్మ మూర్తులు మనదేశంలో అనేకులుద్భవించారని పురాణాలేకాక చరిత్రలు కూడా అనేక విధాలుగా సాక్ష్యం ఇస్తున్నాయి.

## రామాయణం

మొట్టమొదటగా దీనికి రామరాజ్యమే ఉదాహరణగా తీసుకోవచ్చును. రాముడు ధర్మపరిపాలకుడుగానేగాక ధర్మమూర్తిగాకూడా జగద్విఖ్యాతుడైనాడు.

సీత శీలం పరమ పునీతమైనదని రామునికి తెలియకపోలేదు. అయినా ఆమె శీలం విషయంలో అన్యాయంగా లోకాపవాదం బయలుదేరింది. కేవలం ఈ లోకాపవాదం పోగొట్టడంకోసమే రాముడు సీతా పరిత్యాగంచేశాడు. ఇక్కడ రాముడు రెండు ధర్మాలు నిర్వర్తించవలసిఉన్నది. మొదటిది రాజధర్మం. రెండవది భర్తృధర్మం. ఒక ధర్మం నిర్వర్తిస్తే రెండవధర్మం పూర్తిగాలోపించి అన్యాయం జరుగుతున్నది. అయితే రాముడక్కడ విశ్వవ్యాపకమైన రాజ్యధర్మం మాత్రమే చేపట్టి పరిమితమైన భర్తృధర్మం పరిత్యజించవలసినవాడైనాడు.

ఈ విషయమే భవభూతి ఉత్తరరామ చరిత్రలో రాముని ముఖతః చాలా యుక్తియుక్తంగా చెప్పించాడు.

స్నేహం దయాంచ సౌఖ్యంచ
యదివా జానకీమపి
ఆరాధనాయ లోకస్య
ముంచతో నాస్తి మే వ్యథా!

"స్నేహమదయా సౌఖ్యాలను చివరికి సీతాదేవినికూడా లోకారాధనం కోసం విడిచి పెట్టేదానికి నేను ఇంతమాత్రము దుఃఖించను" అని రాముడే శ్లోకంలో అంటున్నాడు. కనుకనే రాముని పరిపాలనకు రామరాజ్యమనే నామధేయంకూడా సుస్థిరమై నాటి నుండి నేటివరకు పరిపాలకుల కందరకు పరమాదర్శంగా నిలిచిపోయింది.

## మాధవవర్మ

మన ఆంధ్రదేశ చరిత్రలో రామాయణకథతో పోల్చదగిన మరిఒక గాథ వినిపిస్తున్నది.

మాధవవర్మ ఒకరాజే కుమారుడు. అతడొకనాడు చక్కని ఉత్తమాశ్వాలు పూన్చిన రథంమీద విజయవాటికలో వాహ్యాళికి బయలుదేరాడు. వాహ్యాళికి బయలుదేరిన రాజకుమారుని ఉత్సాహానికి మేరలేదు. రథం అతి త్వరిత గతితో విజయవాటిక వీధుల్లో పోతున్నది. హఠాత్తుగా యువకుడొకడు రథం క్రిందపడి నుత్తునియలై పోయాడు. వెంటనే జనంలో హాహాకారాలు బయలుదేరాయి. ఆ దౌర్భాగ్యుని తల్లి పడిపోయిన అతని శిరస్సు మీదపడి గోలుగోలున ఘోష పెట్టింది. ఆపెకతడొక్కడే కుమారుడు. అలాగ ఏడ్చి ఏడ్చి చివరికీ విషయం అంతా ఆమె ధర్మాధికారుల దగ్గిర మొరపెట్టుకొన్నది. వారు జరిగినదంతావిని అనేకవిధాలుగా తటపటాయించారు. ఈవార్త రాజుదాకా కూడా వెళ్లింది. రాజేమాలోచించకుండా వెంటనే కుమారునికి మరణదండన విధించాడు. ఆ సమయంలో దేవతలు విజయవాటిక వీధుల్లో సువర్ణ వర్షం కురిపించారని ఈ గాథ చెబుతున్నది.

నిజానికి గాథ రాముని ధర్మపరిపాలనకంటె కూడా కఠినతరమైనది! అయినా నా గత పక్షపాతం చెప్పుమైనా వరించకుండా తనరాజధర్మం నిర్వర్తించి ఆంధ్రజాతికి చిరస్మరణీయుడైనాడు!

మన పురాణాలనుంచీ, చరిత్రలనుంచీ ఇలాంటికథ లెన్నైనా ఉదాహరించవచ్చును.

ఇలాగ అనూచానంగా అభినివేశంతో సాంఘిక ధర్మనిరతి నెరవుకొంటున్న ఆంధ్రజాతికి ఈనాడు ప్రప్రథమంగా ఉన్నత న్యాయస్థానం ... న్యాయం ... వినవస్తున్నది. కాని ఈ రెండుపదాల అర్థాలలోను కొంతభేదం లేకపోలేదు. అదీకాక మనప్రాచీన ధర్మశాస్త్రాలు నేటి పాశ్చాత్య ధర్మశాస్త్రాలతో సమన్వయంపొంది బాగామార్పు చెందాయి.

అదీకాక అటు ప్రపంచ రాజకీయ రంగంలోనేగాక మనదేశంలో భిన్న భిన్నాదర్శాలుకల రాజకీయపక్షాలనేకం బయలుదేరి మనప్రస్తుత సమాజవ్యవస్థ, యీ వ్యవస్థనిర్మించిన ధర్మశాస్త్రాలు కూడా కేవలం అన్యాయం మీదనే ఆధారపడి నడుస్తున్నాయని అనేకవిధాలుగా ప్రచారం సాగిస్తున్నాయి.

ఇది ఇలాగ వుండగా పాలకులధర్మశాస్త్రాలు పాలితులు కూడా అంగీకరించి సంపూర్ణంగా సహాకరిస్తేగాని ధర్మం నాలుగుపాదాలతో నడవడం చాలాకష్టం.

మరి కలియుగ ప్రారంభంలోనే కలిపురుషుడు ధర్మదేవత నాలుగు పాదాలలోను ఒకపాదం విరగగొట్టాడని మనపురాణా లంటున్నాయి.

త్రిమూర్తుల్లా వెలిసిన మనన్యాయమూర్తులిన్ని విధాల సమస్య లెదుర్కొంటూ ఆంధ్రులందరికీ ధర్మసూక్ష్మాలు నిర్వచించవలసి ఉన్నది.

అయితే అధర్మదేవత ఆశీఃప్రభావం వల్ల మన సమున్నత న్యాయస్థానం కూడా దిన దినప్రవర్ధమానమై ఆంధ్రజాతికి తిరిగి సంపూర్ణంగా న్యాయం ప్రసాదించగలదనీ పరిపూర్ణ ధర్మమూర్తిగా విలసిల్లగలదని ఆశిస్తున్నాను.

## గుంటూరుకు రాజమన్నార్ ప్రభృతుల ప్రయాణం

మద్రాసు, జూలై 4: మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పాకాల వెంకటరాజమన్నారు, పూర్వ న్యాయమూర్తి పాకాల వెంకట రమణారావు నాయుడుగారలు, ... మద్రాసు న్యాయమూర్తులు గుంటూరులో ఆంధ్ర హైకోర్టు ... నానికి హాజరు కావడానికి నిన్న రాత్రి పలకన్లు మెయిల్లో బయలుదేరి వెళ్ళారు.



ప్రధాన న్యాయమూర్తి శ్రీ కె. సుబ్బారావుగారి నివాస భవనం



న్యాయమూర్తి శ్రీ పి. చంద్రారెడ్డిగారి నివాస భవనం



న్యాయమూర్తి శ్రీ కొండపల్లి ఉమామహేశ్వరంగారి నివాస భవనం

# 'మరొక స్వప్నసౌధ సంప్రాప్తి' హైకోర్టు అవతరణోత్సవ సమయంలో ముఖ్యమంత్రి ప్రకాశంగారి శుభాశీస్సులు

"ఆంధ్రులు నాలుగు దశాబ్దాలనుంచీ కంటూవచ్చిన ముఖ్యమైన మూడు స్వప్న సౌధములలో నేడు మన కన్నులఎదుట ప్రత్యక్షరూపం దాల్చిన మూడవ స్వప్న సౌధమే ఈ హైకోర్టు. మరల మనము సనాతన ధర్మపథమున పయనించి, మన స్వస్వరూపమును, స్వభావమును అనుసంధానపరచుకొనుటకును, సర్వప్రాణికోటికిని, మనుష్యులకు ఇతరజంతుకోటికీసహా దయాసంభరిత న్యాయసంప్రాప్తి చేకూర్చి మన మనోనేత్రముల ఎదుట నిల్పుకొనిన 'అశోక రాజ్య' దర్శనమును చేరుటకును పరమేశ్వరుడు అనుగ్రహించుగాక!" అని ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవం సందర్భంలో శుభసందేశం పంపించారు.

ఆ సందేశంలో ఇంకా యిలా ఉన్నది:

"ఆంధ్రభూమి మధ్యమున ఆంధ్ర ప్రజానీకమునకొక ఉన్నత న్యాయస్థానము "ఆంధ్ర హైకోర్టు" అను పేరుతో స్థాపితమగుచున్న ఈ శుభముహూర్తమున నా ఆంధ్ర ప్రజకు శుభాకాంక్షలు పంపుభాగ్యము నాకబ్బినందుల కెంతయు ఉప్పొంగుచున్నాను. ఆంధ్రులు నాల్గు దశాబ్దులపై కాలముగ కంటూవచ్చిన ముఖ్యమైన మూడు స్వప్న సౌధములలో నేను మన కన్నులఎదుట ప్రత్యక్షరూపము దాల్చిన మూడవ స్వప్న సౌధమీ హైకోర్టు. మిగత రెండు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, ఆంధ్ర రాష్ట్రము. ఇతఃపూర్వము సిద్ధించియే యున్నవి. ఆంధ్రులిక సగర్వముగ, నిర్నిబంధముగ, స్వగుణ స్వధర్మానుసారముగ పురోభివృద్ధి మార్గముబట్టి, అఖండమగు భరతఖండములో తామొక ప్రగతిశీలమగు అంతఃఖండముగ రూపొంద గలుగుదురని ఆశించుచున్నాను.

"భరతవర్షము అనాదినుండీ న్యాయము, సమత, సర్వభూత సౌభ్రాతృత్వమూ, మున్నగు ఉత్తమాదర్శములను లోకమునకు చూపెట్టిన కరదీపికగ వెలసినది. ఈభావములన్నీ ఒక్క చక్కని ముక్కలో—"ధర్మము" అను చిన్న శబ్దములో మనవారు ఇమిడ్చినారు. ఈ ధర్మము వినీతము, సహజము - ఉత్తేజకరము. విశేంద్రీకృత ప్రజాపాలనా ధర్మసూత్రములను పెంచి పోషించిన పురాతన ఉద్యోల మన భరతఖండము. ఇమిడికనున్న గ్రామ సంఘములు, పంచాయతీలు, గ్రామప్రజలకు కావలసిన సమస్త అవసరములను, న్యాయ సూత్రములను తమ "ధర్మజ్ఞసమయము"లలో నిర్వచించుట మొదలు, వానిని సమదృష్టితో, సర్వభూతహితరతితో - అమలుపరచుటవరకు - తీర్చిదిద్ది నిర్వహించుచుండెను.

"ఇప్పుడీ మన ఆంధ్ర హైకోర్టు మనకు స్వరాజ్యము లభించిన ఈ కాలములో ప్రతిష్ఠింపబడుచున్నదికాన, ఇంతకాలమునుండీ న్యాయము బహు వ్యయప్రయాస భరితముగను, బహు జాప్యముగను, అసహజముగను నోచర్చి మన న్యాయపాలనా పద్ధతులను నానా గజిబిజి చేసి పెట్టుటయేకాక, మనల నొకవిధముగ అధారికమార్గముల బట్టించిన బ్రిటిషు ప్రొసీజరల్ జాలముల నుండి మనము విడివడుటకు ఈ కోర్టు తోడ్పడుననీ, యథాపూర్వముగ దిగువ మెట్టులనుండి న్యాయపరిపాలనా వ్యవస్థలను, ప్రజాకోర్టులను, నిర్మించుకొని వచ్చుచూ, వాటన్నింటిపైన తానొక నిజమైన ఉన్నత న్యాయస్థానముగ వెలసి, లోపములను, పొడసూపు విభిన్న ప్రవృత్తులను సమన్వయపరచుచు, వానికి మార్గదర్శిగ రూపొంద గలదనీ, నేను మనఃపూర్వకముగ ఆశించుచున్నాను.

"ఇది నా ఆకాంక్ష, నా సందేశము, నా ప్రార్థన.

"సర్వసాక్షి, నిఖిల న్యాయాన్యాయ విచక్షణ దక్షుడు అగు పరమేశ్వరుడీ ప్రార్థనను, ఈ వరమును, ఈ సఫలతను మనకు అనుగ్రహించుగాక" మరల మనమీ సనాతన ధర్మపథమున ప్రయాణించి, మన స్వస్వరూపమును, స్వస్వభావమును అనుసంధానపరుచుకొనుటకున్ను సర్వప్రాణికోట్లకు-మనుష్యులకు ఇతర జంతుకోటికిసహా-దయాసంభరిత న్యాయసంప్రాప్తి చేకూర్చి మన మనోనేత్రములయెదుట నిల్పుకొనిన ఆ 'అశోకరాజ్య' ఆదర్శమును చేరుటకును పరమేశ్వరుడనుగ్రహించుగాక.

"ఓం శాంతిః శాంతిః శాంతిః."



## రాష్ట్ర చిత్ర పరిపూర్ణత
## ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుని ఆశీస్సు

మద్రాసు, జూలై 4: ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఇలా సందేశాన్నిస్తున్నారు:

"ఆంధ్ర హైకోర్టు అవతరణతో ఆంధ్రరాష్ట్రచిత్రం పూర్తిఅవుతోంది. రాజ్యాంగానికి న్యాయవర్గము తృతీయ ఉపాంగము. సర్వశాసన ధిక్కారులను న్యాయవర్గము విచారించి, దండించును. ఆంధ్రుల ఆత్మాభిమాన పరిపూర్తికి ప్రత్యేక హైకోర్టు చిహ్నము. మదరాసు హైకోర్టులో ఇంతవరకూ తెలుగు న్యాయమూర్తులు ఎక్కువగా లేరు. కాని, ఇప్పుడు ఆంధ్ర ఉన్నత న్యాయస్థానంలో తెలుగువారే న్యాయమూర్తులుగా ఉండే అవకాశం ప్రాప్తించింది. న్యాయవర్గం యొక్క



స్వతంత్ర ప్రతిపత్తి రాజ్యాంగ నిబద్ధము. ప్రజాశయాలను సాదరముగా వారించుట అవసరము. ఇవి ఉజ్జ్వలమైన ప్రగతిరోజులు. ఆ సంగతి న్యాయస్థానములు గమనించుగాక! న్యాయస్థానములు ప్రభుత్వ కర్తవ్యంపై విస్తరించకుండా వుండవలెను. న్యాయమూర్తులు తామే శాసనముల చేయుటకు ఉపక్రమించుకొందురుగాక. ప్రభుత్వాలకు లివారింపదగని చిక్కులు కలిగించకూడదు. ఆంధ్ర హైకోర్టు ఉత్తమ న్యాయ సంప్రదాయాలను నెలకొల్పి, అదనుంచి కూడా మంచి ఒరవడులను పెట్టుదురుగాక. జూలై 5వ తేదీ ఉత్సవం జయప్రదంగా జరుగుగాక! ఆంధ్ర హైకోర్టు ప్రథమ న్యాయమూర్తులకు వ్యక్తిగతంగానా శుభాకాంక్షలను తెలియజేస్తున్నాను."

## వావిలాల గోపాల కృష్ణయ్యగారి ప్రకటన

సత్తెనపల్లి, జూలై 4: శాసనసభ్యుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఆంధ్రహైకోర్టు ప్రారంభోత్సవ శుభసమయాన యీ దిగువ ప్రకటన చేస్తున్నారు.

ఆంధ్రులు భారతదేశ అంతర్భాగంగా ఒక జాతిగా ఒక పరిపాలనా యూనిట్‌గా మనవలెనని అందుకొక రాష్ట్రం నేటిబాషలో స్టేటు కావలెనని 45 సంవత్సరాలుగా అందోళన త్యాగాలు చేశారు. పూర్తి ఆశయం సాఫల్యం కాకపోయినా మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర జిల్లాలతో నైనా ఒక స్టేటు సాధించారు.

"ఒకరాష్ట్రానికి, జాతికి వారిపరిపాలనను, వారి సంస్కృతినీ ఒక ప్రత్యేకత్వంతో రూపు కట్టుటలు దిద్దుటకు ఒక ప్రభుత్వం దానితో శాఖలు, శాసనసభ, ఒక హైకోర్టు ఒక విశ్వవిద్యాలయం అవసరం. అందరికంటె ముందే రాష్ట్రం వచ్చినతర్వాతి కొరకు ఆంధ్రులకు 1926 లోనే విశ్వవిద్యాలయం యేర్పడింది. 1953 అక్టోబరు 1న ప్రభుత్వం యేర్పడింది. ఇక మిగిలింది హైకోర్టు.

ఆ హైకోర్టు ఈనాడు గుంటూరులో ప్రారంభం అవుతున్నది. ఈ హైకోర్టు అందరి న్యాయవాదులు, ఆంధ్ర ప్రజానీకం ముఖ్యంగా న్యాయమూర్తులు ఆంధ్రులు తరతరాలుగా సాధించిన గౌరవ ప్రతిష్ఠలను, సంస్కృతీసంపదను, పాత బౌజన్యాలను మహోన్నత స్థాయికి అందచేసే విధంగా నిర్వహించవలసి వుంది. ఆంధ్రుల రాజకీయమూందాకు, ఆంధ్రుల చారిత్రక సుస్థిరత, ఆంధ్రుల శాశ్విక స్థాయి ప్రతిబింబంగా ఈ హైకోర్టు దానితోబాటు ఆంధ్రప్రభుత్వం, ఆంధ్ర సంస్కృతీ మన గలుగుతుందని ఆశిస్తున్నాను.

"ఇంతవరకు ఆంధ్రులు ఉద్యమాలలో సాత్రమే రాష్ట్రం సాధించారు. నిర్మాణాత్మకమైన విశాలాంధ్ర సాధించుటకు ఈ ఉత్సాహ సమయంలో ప్రతిన చేసి కావి ముందుకు సాగాలెరని ఆశిస్తున్నాను. జై ఆంధ్రా!"

# "న్యాయ నిర్వహణలో ఉన్నత సంప్రదాయాలను ఇనుమడింప జేయాలి"

—విశ్వనాథంగారి శుభాకాంక్ష

ఇంతవరకు మద్రాసు హైకోర్టులో తమ విశిష్టతను ప్రదర్శిస్తున్న ఆంధ్ర న్యాయవాదులు ఇక ఆ ఉదాత్త, ఉత్కృష్ట సంప్రదాయాలను ఇంకా ఇనుమడింపచేయగలరని నమ్ముచున్నానని ఆంధ్ర ప్రభుత్వ న్యాయశాఖ మంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవానికి పంపిన సందేశంలో ఉద్ఘాటించారు.

ఆ సందేశంలో ఇంకా యిలా వున్నది:

"రాష్ట్ర వ్యవస్థ పరిపాలనకు ఒక చిహ్నంగా హైకోర్టు నిడిగా ఉండటం. ఆంధ్రరాష్ట్ర స్థాపనా సందర్భంలో హైకోర్టు నిర్మాణం గురించి తలపెట్టానికి వీలు లేకపోయింది. అప్పటి చిక్కుల పరిస్థితిలో. కాని, రాష్ట్ర స్థాపనానంతరం ప్రభుత్వం ఈ విషయం గురించి ఎప్పుడో 1953 నవంబరులో ఒకనిర్ణయానికి రావటం, దానిని శాసనసభ ఆమోదించటం జరిగినవి. తాత్కాలికంగా హైకోర్టును గుంటూరులో స్థాపించాలని శాసనసభ నిర్ణయించింది. తత్ఫలితంగా నేడు మన ఈ ఉత్కృష్ట న్యాయసంస్థకు ఇక్కడ ప్రారంభోత్సవం జరుగుతోంది.

"కేంద్రప్రభుత్వ హోంశాఖమంత్రి మన హైకోర్టుకు ప్రారంభోత్సవం జరపటం ముదావహం. ఈ హైకోర్టు స్థాపనకు వారు కర్తలు. మిగతా రాష్ట్రాలన్నిటి శుభాకాంక్షలు, ఇతర హైకోర్టుల ప్రోత్సాహమూ మనకీ నాకు ముందునుకు వేయిస్తున్నవి. ఇంతవరకు మద్రాసు హైకోర్టులో తమ విశిష్టతను ప్రదర్శిస్తున్న ఆంధ్ర న్యాయవాదులు ఇక ఆ ఉదాత్త, ఉత్కృష్ట సంప్రదాయాలను ఇంకా ఇనుమడింప చేయగలరని నమ్ముతున్నాను. వారు, కొత్తగా వారితో కలసి పనిచేయువారు పరస్పర సహాయంలో మన నవ న్యాయ సంస్థ తేజస్సు అధికం చేయగలరని ఆశిస్తున్నాను.

హైకోర్టు కొత్తది అయినా, దాని న్యాయవాదులు ఆనాదు పనికి కొత్త కారు. ప్రభుత్వం, శాసనసభ, ప్రజలు అందరకు నీరి దక్షతలో సంపూర్ణ విశ్వాసమున్నది.



ఆంధ్ర అడ్వొకేటు జనరల్ శ్రీ పి. వద్యరాజుగారు.



"ఈ శుభ సమయాన, కొత్త హైకోర్టుకు, దాని న్యాయవాదులకు నా వినయపూర్వక అభినందనాలను అందజేస్తున్నాను. జై ఆంధ్ర!"

## రథ చక్రాల కింద 5 గురి దుర్మరణం

బర్ద్వాన్, జూలై 3: ఇక్కడికి 25 మైళ్ల దూరంలో వున్న మైప్పూరిలో నిన్న జరిగిన రథోత్సవంలో, రథచక్రాలకింద పడి 5 గురు మరణించారనీ, ఇద్దరు తీవ్రంగా గాయపడ్డారనీ తెలుస్తోంది. చనిపోయిన 5 గురిలో 4 గురు స్త్రీలని తెలుస్తోంది.

ఇక్కడ జరిగిన రథయాత్రకు 25 వేల మంది వచ్చారట. నిశ్చంచనుకున్నంతగా జనం రద్దీవల్ల 6 గురు చక్రాల కింద పడిపోయారట.

# 'న్యాయనిర్వహణలో విశిష్ట సంప్రదాయాలను శ్రద్ధగా కాపాడుకోవాలి'

—గవర్నర్ త్రివేదీ హితోక్తి

"ప్రసిద్ధులయిన న్యాయమూర్తులతో, వారికి సమానులయిన న్యాయవాదులతో పేరుపొందిన మద్రాసు హైకోర్టు న్యాయపరిపాలనా రంగంలో విశిష్టమైన సంప్రదాయాలను నెలకొల్పింది ఈనాడు ఆంధ్ర హైకోర్టును ఇక్కడ స్థాపించడం నిజంగా చరిత్రాత్మకమైన విషయం" అని ఆంధ్ర గవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదీగారు ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవానికి సందేశం పంపించారు.



ఆంధ్ర గవర్నరు శ్రీ త్రివేదీ

ఆ సందేశంలో ఇంకా యిలా వున్నది:

"1954 5వ తేదీ నుంచి గుంటూరు ప్రధాన కార్యాలయంగా ఆంధ్ర హైకోర్టు స్థాపించబడటం నిజంగా చరిత్రాత్మకమైన విషయం. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఇంత శీఘ్రంగా ప్రత్యేకంగా ఆంధ్ర హైకోర్టు సిద్ధించటం మనందరకూ ముదావహం. ప్రసిద్ధులైన న్యాయమూర్తులతో వారికి సమానులైన న్యాయవాదులతో పేరుపొందిన మద్రాసు హైకోర్టు న్యాయపరిపాలనా రంగంలో విశిష్టమైన సంప్రదాయాలను నెలకొల్పింది. ఈ సంప్రదాయాల గురించి ఏ రాష్ట్రమైనా గర్వించవచ్చు. ఈ సంప్రదాయాల ఫలితంగా, మద్రాసు హైకోర్టు ప్రజల అత్యుత్తమ గౌరవం, విశ్వాసం సమకూరినవి. మద్రాసు హైకోర్టు గడించుకున్న ఈ ఉత్కృష్ట

# "నవ్యాంధ్ర చరిత్రలో ముఖ్యమైన ఘట్టం"

—ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి సందేశం

"నవ్యాంధ్ర చరిత్రలో ఆంధ్రహైకోర్టు ప్రారంభం ముఖ్యమైనఘట్టం." అని ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి గారు తమ సందేశంలో ఉద్ఘాటించారు.

ఆ సందేశంలో యింకా యిలా ఉన్నది:

"శైశవదశలో నున్న మనరాష్ట్రం సిద్ధించుకుంటున్న అభ్యుదయానికి సౌష్ఠవానికి ఒకవిధంగా యిది నిదర్శనం.



మద్రాసు హైకోర్టు, న్యాయవాదులు యీనాడు అంత ఉచ్చస్థితిని పొందటానికి ఆంధ్రులెంత మహత్కృషిని సల్పినదీ ప్రత్యేకం పునరుక్తి చేయనక్కరలేదనుకుంటాను. మన హైకోర్టు సభ్యులు, న్యాయవాదులు ఈ ఉజ్జ్వల సంప్రదాయాలను నిలబెట్టడమే కాక, మనదేశపు న్యాయశాఖకు శాశ్వతమైన ఉద్దీప్తమైన యశస్సును చేకూర్పగలరని ఆశిస్తున్నాను."



ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవం జరుగుతున్నది. ఇది చాలా ముఖ్యమైన చరిత్రాత్మకమైన సమయం. ఈ ప్రారంభోత్సవ సభకు హాజరు కాగలిగితే చాలా ఆనందించి ఉండేవాణ్ణి. కాని, ఒక ప్రమాదానికి గురికావటం వల్ల కర్నూలు జిల్లా హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నాను. కనుక ఈ ప్రారంభోత్సవ సభకు రాలేక పోయినందుకు చింతిస్తున్నాను. సభకు ఇవే నా హృదయపూర్వక శుభాభివందనలు. స్వయంగా నేను ఈసభకు రాలేక పోయినందున నా తరపున ఆంధ్ర శాసనసభ తరపున ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవం సభలో ప్రాతినిధ్యం వహించవలసిందిగా శాసనసభ కార్యదర్శి శ్రీ జి. వి. చౌదరిగారిని కోరుతున్నాను."



## మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సందేశం

మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పాకాల వెంకట రాజమన్నారుగారు ఆంధ్ర హైకోర్టు అవతరణోత్సవ సందర్భాన ఈ శుభ సందేశాన్ని ఇస్తున్నారు.

"ఆంధ్రదేశ చరిత్రలో జూలై 5వ తేదీ అపూర్వమైన పర్వదినము. అక్టోబరు 1వ తేదీన ఆంధ్ర రాష్ట్రము వచ్చినా ఈనాడే వాస్తవానికి రాష్ట్ర నిర్మాణము పరిపూర్ణమైనదనవలెను. ఈ శుభముహూర్తాన ఆంధ్రప్రజకు, నా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలుపుతున్నాను. ఈ న్యాయపరిపాలనాసంస్థ ప్రతిష్ఠాపన బాధ్యులుగా డా॥ కైలాసనాథ కట్జూగారు రావడం మన భాగ్యవిశేషము.

"మద్రాసు హైకోర్టులో న్యాయమూర్తులుగా ఉండిన ముగ్గురు ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తులు అగుటతో వారివెంట ఉత్తమ న్యాయమూర్తుల సంప్రదాయములను, ప్రమాణములను కొనివచ్చుచున్నారనవచ్చు. ఆంధ్ర రాష్ట్ర మాత్ర ఉన్నత న్యాయస్థానము సరికొత్త పరపనుల పెట్టి న్యాయస్థాన ప్రపంచమున కొత్త ఆచారములను, కొత్త సంప్రదాయములను సృష్టించవచ్చును. ఆంధ్రరాష్ట్రములో ప్రజాస్వామ్యము, ఆంధ్ర హైకోర్టు ప్రదర్శించు స్వాతంత్ర్యతలు, నిష్పాక్షికత, పరిశుద్ధత పైన ఆధారపడి ఉన్నదనీ, ఈ ఉత్తమ లక్షణాలు రక్షించుటకు ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తులు అనవరతము యత్నింతురనుటకు నాకెట్టి సందేహమును లేదు. భగవంతుడు అతని లీలావిశేషములలో ఒకటైన ఈ సూత్న ఉన్నత న్యాయస్థానమును ఆశీర్వదించుగాక."



ఆంధ్ర గవర్నమెంటు ప్లీడరు శ్రీ పి. సత్యనారాయణరాజు.



ఆంధ్ర గవర్నమెంటు అడిషనల్ ప్లీడరు యం. శేషాచలపతి.



పబ్లిక్ ప్రాసిక్యూటర్ మునికన్నయ్య గారు

## 'శుభసమయం' స్పీకర్ వెంకట్రామయ్య గారి సందేశం

ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవం సందర్భంలో ఆంధ్ర శాసన సభ స్పీకరు నల్లపాటి వెంకట్రామయ్యగారు ఈదిగువ సందేశం పంపించారు:

"నా జిల్లా అయిన గుంటూరులో ప్రాధాన్యం ఆంధ్రలో ఆంధ్ర హైకోర్టు ప్రతిబింబింప చేస్తుంది. అంతే కాదు. మన హైకోర్టు ఈ ప్రాధాన్యాన్ని ఇంకెక్కువ ఇనుమడింప చేయగలదన జంలో కూడా నా కెట్టి సందేహమూ లేదు. ఈ శుభసందర్భాన హైకోర్టుకు, న్యాయవాదులకు, నాతోటి పౌరులకు నా అభినందనలను అందజేస్తున్నాను."



సుప్రీంకోర్టు న్యాయమూర్తి బచ్చు జగన్నాధరావుగారు.

## మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులు

సర్ థామస్ ఆండ్రూ లూమిస్‌డన్ స్ట్రేంజి 1801-16
సర్ జాన్ హెన్రీ న్యూబోల్డ్ 1816-20
సర్ ఎడ్మండ్ స్టాన్లీ 1820-1825
సర్ రాల్ఫ్ పామర్ 1825-1835
సర్ రాబర్ట్ బక్లీ కోమిన్ 1835-1842
సర్ ఎడ్వర్డ్ జాన్ గాంబియర్ 1842-50
సర్ క్రిస్టొఫర్ రావిన్‌సన్ 1850-1859
సర్ హెన్రీ డేవిసన్ 1859-1860
సర్ హాలీహర్మన్ స్కాట్లెండ్ 1860-62
సర్ కూలీహర్గస్ స్కాట్లెండ్ 1862-71
సర్ వాల్టర్ మూరస్ 1871-1879
సర్ ఛార్లెస్ ఆర్థర్ టర్నర్ 1879-85
సర్ ఆర్థర్ జాన్ హామెండ్ కాలిన్స్ 1885-1899
సర్ ఛార్లెస్ ఆర్నాల్డు వైయిట్ 1899-1914
సర్ జాన్ ఎడ్వర్డ్ పవర్ వాలిస్ 1914-1921
సర్ వాల్టర్ జార్జి సాలిస్ స్కాబెంబ్ 1921-1924
సర్ విక్టర్ ముర్రే కూట్స్ ట్రాటర్ 1924-1929
సర్ హారేస్ ఓవన్ కాంప్టన్ బీస్లీ 1929-1937
సర్ ఆల్‌ఫ్రెడ్ హెన్రీ లయొనల్ లీచ్ 1937-1947
సర్ విలియం జెంటిల్ 1947-1948
పాకాల వెంకటరాజమన్నార్ 1948

## మద్రాసు హైకోర్టులోని ఆంధ్ర న్యాయమూర్తులు

సర్ వేపారామేశం 1920-1935
సర్ ముత్తా వెంకటసుబ్బారావు 1921-1938
శ్రీ పాకాల వెంకటరమణరావు 1935-1942
శ్రీ కోడుగూరు సోమయ్య 1939-1946
శ్రీ పాకాల వెంకటరాజమన్నారు 1945-1948
శ్రీ వింజమూరి గోవిందరాజాచారి 1946-1948
శ్రీ యూహ్యాలీ సాహెబ్ 1948-1949
శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు 1948-1954
శ్రీ కోకా సుబ్బారావు 1948-1954
శ్రీ చింతగుంటరాఘవరావు 1949-1953
శ్రీ పలగాని చంద్రారెడ్డి 1950-
శ్రీ కొండగుంట ఉమామహేశ్వరం 1953-

ఏనయి యేళ్లకు పై నాటిమాట. సీమ రాజె దొరతనము ఏలేమంతటా అల్లు కొన్నది. ప్రజలకు ఒక విధమయిన సంతృప్తి, ఆంగ్లప్రభుత్వం యెడల ఒక విధమయిన విశ్వాసము కనబడేదినాలవి. బందరు జిల్లాకోర్టులో రాబర్ట్సన్ అని కొహాలు పెనుగల రయూరపియను జడ్జి ఒకరు ఉండేవారట. ఆయన చంద్ర ప్రచండగుడు స్వయంగా విశేష శ్రీగ్య గాలి కొందరు సాగును పిల్లని పెంచి నట్టుగా ఆయన చిరుతపులిని పెంచే వారట. దానిని నాకిటల్లో కట్టి ఉంచే వారట. కడలూరులో ఆయన ఉన్నప్పుడు, ఆ చిరుతపులి ఒక బుస బుసక్కాలవాణ్ణి చూచి కళ్లు తెంచుకుని పైనిబడి కరచి రక్కించినంతలో, సర్కారువారు దొరగారిని బందరు బదిలీ చేశారట. చిరుతపులిని పెంచే ఈ దొరగారికి నల్లవాళ్ళంటే ఈసడింపు. మరి ఆయనకు ముక్కున కోపము. జడ్జిగా పై అంతస్తులో కూర్చుని, ఎవ రేది చెప్పినా వినకుండానే, కోప పడుతూ, వకీళ్లను పట్టుకొని కొట్టుదులిపినట్లు దులిపి, కొట్టినంతపని చేసేవారట. అటువంటి జడ్జిగారు ఒకదినం కోర్టు చేస్తున్నారు. ఒకానొక కేసులో యువకుడైన వకీలుగా రొకరు ఏదో మనవి చేసుకోబోయినారట. దొరగారు ఆగ్రహంలో ఉండి, తమయొక్క పెంపుడు చిరుతపులి కొండించినట్లు కొండ్రించడం ప్రారంభించాడు. పైగా మాటలు మిగిలాడట. యువక న్యాయవాది జబ్బులి బొబ్బరించినట్లు బొబ్బ రించాడు. రెండు చేతులపైని కోటు చొక్కా పైకి ఎగద్రోసుకుంటూ, "అధిక ప్రసంగం చేస్తే మాట దక్కదు" అనుకుంటూ ముందు ముందుకు పోతుంటే ఇతర న్యాయవాదులు బల వంతంగా పట్టుకొని ఆపారట.

ఆ యువక న్యాయవాది కంతే సుల భాగ్రహము. జడ్జికి ముక్కున కోప మయితే, ఈయనకు ముక్కుచివర కోపము. అన్యాయము, అహంకార సంభాషణమో అధికార దుర్వినియోగమో ఆయనకు ఆగ్రహం కలిగిస్తుంది. అప్పుడు ఆయనకు ముఖ మెఱ్ఱపడిపోయి, పెదవులు కదిలిపోతూ, ఒళ్ళంతా వణికిపోతుంది. ఆగ్రహం కలిగించినవాడు జడ్జిగానీ, జగదీశ్వరుడు కానీ, ఆలోచనలేదు వెనుకంజలేదు.

### దేశభక్తుడు

తానా, ధర్మమార్గం తప్పడు. ఆ ధర్మంవల్ల వచ్చే మేరుపర్వతాన్ని కాలితో తన్ని, ధర్మకీర్తిని లభించే

# వకీల్ వృత్తి... గుంటూరు...

## శ్రీ కపిల వెంకట్రావు గారు

త్రుణం స్వీకరించి సంతోషిస్తాను. ఆయన ఆలిర్వాలి ఒంపరు విడిచిపెట్టి, గుంటూరులో జిల్లాకోర్టులో వకాల్తీ చేశారు. న్యాయవాదిగా ఆయన అతి రాల న్యాయవాది న్యాయమూర్తివాడి. అక్రమము, అధర్మము అధికారి దౌర్జన్యము ఎక్కడ కనబడినా, వినబడినా ఆగ్రహోదగ్రుడై విరుచుకునిపడి, ఆయన సంకన్న కీర్తి యెక్కువగా ఆర్జించారు. ఆంధ్ర ప్రజలకు ప్రత్యేకరాష్ట్రము కావాలని ఆజన్మ కృషి చేశారు. సహాయ నిరాకరణోద్యమంలో తొలుతగానే ప్రవేశించి, జైలుకుపోయి ఆయన చాలా కష్టనష్టాలు పొందారు. ఆడంబర మెరుగనివారు అహంభావ మెరుగని వారు ఆయన బుజావర్తనము, అసంకిత దేశభక్తి, ఆత్మత్యాగము ఆయనకు ఆలిండియా కాంగ్రెసున కర్తృత్వపదవి తెచ్చిపెట్టినవి. గాంధిమహాత్ముని కాయనయందు సహోదర ప్రేమ. ఆ నిరాడంబరజీవి, మహానుభావుడు దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులు గారు. ఆంధ్రరాష్ట్రముయొక్క గోత్రంలో మొట్టమొదటి ఋషి. ఆంధ్ర ప్రజకు నిత్యస్మరణీయుడు.

### పూర్వపు కోర్టులు

చెట్టుక్రింద వకీళ్లు మొదలు చెన్న పట్నపు వకీళ్లవరకు తెలుగువాళ్లూ ఉండేవారు. మద్రాసు సుప్రీంకోర్టులో బందరువాస్తవ్యులు కృత్తివంటి వెంకట లక్ష్మీనారాయణపంతులుగారు ఉండే వారట. సుప్రీంకోర్టు క్రింద ప్రావిన్షియల్ కోర్టులు ఉండేవి. బందరులో ఒక ప్రావిన్షియల్ అప్పీలు కోర్టు కూడా ఉండేదట. ప్రావిన్షియల్ కోర్టులు మన సబుకోర్టుల వంటివి. ప్రావిన్షియలు అప్పిలేటు కోర్టులు మన జిల్లా కోర్టులవంటివి అని తోస్తుంది. కొన్ని ముఖ్యగ్రామాలలో జిల్లా మునసబుకోర్టులు ఉండేవి. ఇప్పుడు కేవలం గ్రామాలనిపించే చేబ్రోలు, కార్యంపూడి, కొలకలూరు, ప్రత్తిపాడు, జగ్గయ్యపేట గ్రామాలలో జిల్లా మునసబు కోర్టు లుండేవట. శిథిలమైన ఆ కోర్టు కట్టడాలు ఈనాడు చాలా చిన్నవిగా కనబడతవి. వాటిలోనే ఒక చిన్న బల్ల, కుర్చీ వేసుకుని జిల్లామునసబుగారు

కూర్చుని కచ్చేరి చేస్తుంటే చాపలు వేసుకొని వకీళ్లు కూర్చునే వారట అది ఒక వీధి బడివలె ఉండేది కాబోలు జిల్లా మునసబులు వకీళ్ళు అందరూ తెలుగు వచ్చినవారే కాని ఇంగ్లీషు వచ్చిన వారు కారు. కారు బారు అంతా తెలుగులోనే నడిచేది.

### వకీళ్లు

ఆవిర్భవిల్లా మద్రాసు హైకోర్టు ఏర్పడి, జిల్లా కోర్టులు, సబుకోర్టులు జిల్లా మునసబు కోర్టులు ఏర్పడ్డవి. చెట్టుక్రింది వకీళ్లు తగ్గి పట్టా వకీళ్లు ప్రబలమయినారు. వారైనా ఇంగ్లీషు వచ్చిన వారు కారు. పట్టాలు శిరస్తాదారుగారి శిఫారసు పైని జిల్లాజడ్జీలు ఇచ్చేవారు. ఆ పట్టప్రదాన సమయం మించిపోయిందమోనని పనిచేస్తున్న మంగలి ఒకడు పని సంగంలోమాని పరుగెత్తినట్లు వీరేశలింగంపంతులుగారు ఒక ప్రహసనంలో పరిహసించగా సర్కారువారు పట్టాలకు పరీక్ష ఒకటి ఏర్పాటు చేశారు పరీక్షవ్యాసయి పట్టాపొందిన తెలుగువకీళ్లలో సమర్థులు లేకపోలేదు. తండ్రి తాతలనాటినుంచి వ్యవహార జ్ఞానం ఉండి, సంస్కృతంలో, సాహిత్యం కూలంకషంగా సంపాదించుకొని, ప్రపంచానుభవం కొంత కలిగిన తర్వాత వకీలువృత్తిలో ప్రవేశించి, విశేష ధనము, కీర్తి సంపాదించినవారెందరో ఉన్నారు. గుంటూరిలో పాతూరివారి, వడింపల్లివారి కుటుంబాలలో సమర్థులైన తెలుగు వకీళ్లు ఉండేవారని వినికిడి.

### ప్లీడర్లు

అటు తర్వాత ఇంగ్లీషు యొక్క ప్రాబల్యము రానురాను హెచ్చి, ఇంగ్లీషు వచ్చిన వక్కీళ్లు రావడం సాగించినారు సెకండ్ గ్రేడ్ ప్లీడర్లు, ఫస్టుగ్రేడు ప్లీడర్లూ, హైకోర్టు ప్లీడర్లు బలిశారు మెట్రిక్యులేషనో, మిడిలు స్కూలు ఫస్టుక్లాసో పాసవుతే ప్రైవేటుగా సెకండు గ్రేడు ప్లీడరు పట్టాపరీక్షకు చదువవచ్చును. కీ॥ శే॥ వింజమూరి భావనాచార్లుగారు మెట్రిక్యులేటు, ప్రైవేటుగా సెకండు గ్రేడు ప్లీడరీ పట్టా పరీక్షకు వెళ్లినవారు. అటు తర్వాత F. A. పరీక్షలో కృతార్థులైన వారికే గాని సెకండు గ్రేడు ప్లీడరీ పరీక్షకు పోయేఅర్హత లేకుండా పోయినది. ఆ తర్వాత సెకండు గ్రేడు ఫస్టుగ్రేడు పరీక్షలు తీసి వేయబడినవి.

... ... ... తెలుగుదేశంలో వకీలు వృత్తి ఒకప్పుడు మంచిధనము. పలుకుబడిని తెచ్చిపెట్టిన వృత్తి. గవర్నరు జనరలు, కవున్సిలులో మెంబరయిన కృత్తివంటి వేంకటరాజు పంతులుగారు సెకండుగ్రేడు ప్లీడరు. రమేశచంద్ర దత్తు పొగడ్తలకు పాత్రుడైన గంజాం వెంకటరత్నం పంతులుగారు సెకండు గ్రేడు ప్లీడరు

వారు జమీందార్లకు, సర్కారుకు ప్లీడర్లుగా ఉండేవారు వారికి రాబడికి మంచిఅవకాశాలుండేవి. అయితే, మొదటి మొదటిలో వకీలువృత్తి అంటే దేశంలో విశేష గౌరవంలేదని తోస్తుంది. అదినాలలో మగవాడైనవాడు చేయవలసినది ఉద్యోగము; అది వి తాసీల్దారు ఉద్యోగమో, తప్పితే, డెప్యూటీ కలెక్టరు ఉద్యోగమో, సబురిజిస్ట్రారు ఉద్యోగమయినా ఇబ్బంది లేదు బ్రతకలేక బడిపంతులు పని అయినా చేయవచ్చునుగాని, వకీలు వృత్తి వద్దుగాదు...

### అన్యాయ్య ధోరణి

దీనికి కారణం ఏమిటని విచారిస్తే వకీళ్లే కొంతవరకూ బాధ్యులేమో నని పిస్తుంది. ధనార్జనమే ప్రధానంగా పెట్టుకుని పార్టీలను పీల్చిపిప్పిచేసే విధానాలు ప్రయోగించే వకీళ్లు ఉండేవారేమోనని ఊహకలుగుతుంది. ఎక్కడో ఏవో ఊళ్లో ఒక వకీలు గారు ఉండేవారట ఆ ఊరికి విశేషదూరంలో ఉన్న ఇంకొక ఊరిలో ఉన్న మేజస్ట్రేటు కోర్టులో కేసుకు వకాలతు ఫీజు కట్నం ఏర్పర్చుకొని, కొంత బయానా తీసుకుని, ప్రయాణమయి, మధ్య మజిలీలో ఉండగా ఆ వకీలుగారికి కడుపునొప్పి వచ్చిందట. ఆ కడుపునొప్పి భోజనంవల్ల అయిన బండి తిరిగి యింటికి రప్పించమని గోలచేస్తే ఆ పార్టీ మరొక నూరు రూపాయలు కట్నం ఇచ్చుకుంటానని మనవిచేసుకున్నంతలో ఆ కడుపునొప్పి తగ్గి, రోగికి స్వస్థత చేకూరినవాడై ప్రయాణం సాగించెను. మరొక గ్రామంలో ప్రాక్టీసుచేసే వకీలుగారొకరు కోర్టులో దాఖలు చేయవలసిన కాగితాలు వ్రాసేటప్పుడు, కట్నం నిర్ణయించుకుంటూ, బల్లమీదవున్న ఎర్రట్టి నల్లట్టి పుస్తకాలలో ఎర్రపుస్తకంలో చూచివ్రాస్తే నూరు రూపాయలని, నల్లట్టిపుస్తకంలో చూచివ్రాస్తే ఏభయ్యారు రూపాయలని చెపుతూండేవారట. కష్టం, విద్య, రెండూ ఎక్కువగా ఉన్న కష్టదాకొకరు "రెండు పుస్తకాలూ చూచి రాసిపంపితే, నూరు వంద పుచ్చుకుంటాను" అని చెప్పేవాడట..

అప్పటివాళ్లెరా వ్రాస్తున్నప్పుడు ఒక వకీలుగారు ఒకవిధానం అవలంబించేవారట. అప్పీళ్లువ్రాసేటప్పుడు మామూలుగా పడికట్టుగా వ్రాసే ముక్క

ఉన్నవి మొదటిగాక్యము— "క్రింది కోర్టుతీర్పు కేసులోని అంశాలకున్నూ, చట్టాలకున్నూ, సాక్ష్య ప్రాబల్యాన్ని కిన్నీ వ్యతిరేకంగా ఉన్నది" అ పడికట్టు మాటలు వ్రాసే వకీలుగారు, వ్రాస్తూ వ్రాస్తూ, తలపంకించి, కళ్లు మూసి, ఆలోచించి, 'హైకోర్టువారి తీర్పులకున్నూ" అనికూడా కలుపుదామనుకున్నాముగాని, క్రిందికోర్టు మునసబు పిల్లలుగలవారు, అంతిమాట మనం వ్రాయకూడదు" అనేవారట. అపరంగా, ఆ పార్టీ వకీలుగారిని

రెండు చేతులూ పట్టుకొని, "తమరు రెండు వందలు ఎక్కువయినా పుచ్చుకుని ఆ మాట కాస్తా వ్రాసెయ్యాలి. కోర్టు మునసబు పిల్లలుగలవాడెయినా, నా కొంప మునచలేదండీ" అని బతిమాలి ఆ రెండు వందలూ చెల్లించే వారట... "మీ కేసులో సాక్ష్యం బాగాలేదు. ఏదైనా కాగితం ఉండాలి. ఉంటుంది. కరణంగార్ని కను క్కోండి ఉంటుంది" అని ఒక వకీలు గారు చెవితే పార్టీ మరునటి నాయిదారు కరణంగారి తోడ్పాటుతో ఒక కాగితం కేసులో ఆధార భూతమైన దాన్ని హాజరుపర్చే వాడట. "కేసులో నేను ఎంతకష్టపడి వాదించినా లాభంలేదు, జడ్జి గడ్డి తిన్నాడు" అని పార్టీలకు ఒక్కొక్కప్పుడు సమాధానం వచ్చేదట

### చెట్టుకింది వకీళ్లు

ఒకానొక చెట్టుక్రింది వకీలు చెప్పే ఆర్గ్యుమెంటు ఎటువంటిదనగా: "మహాప్రభూ! ఖామరాజులవారు కరుణించాలి. తమరు బుద్ధిని బృహస్పతులు నా పార్టీ నిర్దోషి. ఎందువల్లనంటే, నాకు నలుగురు కుమార్లు. ఇద్దరు అక్కరకురాలేదు. మూడవవాడు తమ సన్నిధినే మెట్రిక్యులేషను ప్యాసయి, దొరల కాలేజిలో చేరాడు. నాల్గవవాడు మొన్ననే ఉపనయనమయి యింటిదగ్గరే ఉన్నాడు. ఆ ఖాపతు నాకు నాలుగువందలరూపాయల అప్పఉన్నది. అది తీర్చక తప్పదు కనుక నేను నాపక్షం చేయించవలెను." అని ఒక కోర్టులో ఒక వకీలు తన కేసు 200 సెక్షను అని చెప్పగా. అవతలివకీలు తన కేసు 300 సెక్షను అని వాదించేవాడట. ఒకరినొకరు దిక్కరించుకుంటూ, కోర్టులో లేనన్ని సెక్షనులు చెప్పగా చెప్పగా మునసబో మేజస్ట్రేటో ఏదో ఒక సెక్షనుతో తృప్తిపొందేవాడట. ఇటువంటిదే అనువ్యను ఒకవాద విధానమని అములులో ఉండేదని నేను ఈదినమే విన్నాను. కేసులో ఆర్గ్యుమెంటు చెప్పి వకీలుగారు "నేను ఆధారపడేతీర్పు పదమూడు అలహాబాదు నాలుగువందల ఏభై" అంటే ఎదుటివకీలు "అయ్యా, నేను పదహారు కలకత్తా అయిదువందలమీద ఆధారపడుతున్నా"నంటాడట.

ఇవన్నీ కట్టుకథలూ, వట్టి మాటలూను. వకీళ్లు ఎంతవాణ్ని లక్ష్యం చేయరు. పరాయి ప్రభుత్వం ఉన్న న్నాళ్లు ఆ ప్రభుత్వం అండను అధికారం చలాయించే వాళ్లని ఆ అర్థరుకు ఆధారమేమిటి, ఈ అర్జుక్కు ప్రయాణ మేమిటి అని నిగ్గదీశారు. అది వాళ్ళకి పచ్చి వెలగకాయలాగ గొంతుక పట్టుతుంది. ఊపిరి తిరగక, వకీళ్ళని మాటలంటారు. తెలుగు దేశంలో వకీలువృత్తి జన ప్రియమైన వృత్తే అనుకుంటారు. లేకుంటే, ఇంతమంది వకీళ్ల యిళ్లు చుట్టూ అంతంతమంది జనం ఎందుకుంటారు? ఉన్న వాళ్లు ఉండగా క్రొత్తవాళ్లు వకాల్తీ ఎందుకు చదువుకుంటారు?

### కందపెండలం కేసు

ప్రీవీకవున్సిలుకు అప్పీలు చేయబడిన ఒక దావాలో "కందపెండలం" ప్రాముఖ్యంవహించి, చివరకు ఆ దావా పేరు ఈనాటికీ 'కందపెండలం కేసు' అని వ్యవహరిస్తున్నారు. ఈ పేరుతోనే ఈనాటికీ ఈ కేసును కోర్టులలో ఉదహరిస్తున్నారు కూడా.

కృష్ణాజిల్లా గుడివాడ మునసబు కోర్టులో మొట్టమొదటగా ఈ కేసు విచారించబడింది.

జమీందారీ భూములలో ఆహార పంటకు బదులు వాణిజ్యపంట పండించి, ఎక్కువ ఆదాయం సంపాదించిన రైతునుండి, హెచ్చుమక్తా వసూలు చేయడానికి జమీందారుకు హక్కువున్నదా లేదా? అనేది ఈ దావాలో ప్రధానాంశం. ఆహార పంటకు బదులు వాణిజ్యపంటలైన 'కందపెండలం' పండించి ఎక్కువలాభం సంపాదించడం, జమీందారుగారు ఎక్కువ మక్తాయివ్వాలని దావాచెయ్యడం, ఇది మునసబుకోర్టు, జిల్లాకోర్టు, హైకోర్టులు దాటి ప్రివీకవున్సిలవరకు వెళ్లి పరిష్కరింపబడడం, దీనివలన కొన్ని న్యాయపరిష్కారములలో కొత్తసూత్రాలను ప్రతిపాదించడం జరిగింది.

### శ్రీ కామరాజ్ సందేశం

మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ. కామరాజ నాడారుగారు ఈ సందేశాన్నిస్తున్నారు. "ఆంధ్రరాష్ట్ర విభజనానంతరం ఆంధ్ర హైకోర్టు ప్రత్యేకంగా స్థాపన అవడం సహజమే. ఆంధ్ర హైకోర్టు న్యాయ, ధర్మ పరిపాలనలోను, ప్రజాస్వామ్య ధర్మ నిర్వహణలోను ఉత్తమ పథాన్నందుకొని, దేశంలో ఉత్తమ ఉన్నత సంస్థలలో ఒకటి కాగలదని ఆశిస్తున్నాను."

చరిత్రకెక్కి, లభించినంతవరకు, చూస్తే, గుంటూరు పేరు మొదటి సారిగా 1147 సంవత్సర ప్రాంతపు ఒక శాసనంలో కనబడుతుంది. బెజవాడ, దుర్గా మల్లేశ్వర దేవస్థానానికి దిగువలోఉన్న మూడు శాసనాల్లో, భీమన ప్రభువద్ద అధికారిగా ఉంటుండె సోమనామాత్యుడు వేయించిన ఆశాసనంలో ఇట్లా ఉంది... "పాటిశెక్కిన బెజవాడ మల్లేశ్వర దేవరకునఖండదీపతులు పెట్టి, గుంటూర జెర్వులు పెక్కుగుడులు నిలిపి, సప్త సంతతుల సంఖ్యలుగజేసె దత్తినామాత్యసోముండు ధర్మపరుడు దారభాను జాడా చంద్రతారకమున"

ఇదిగాక, గుంటూరు అగస్త్యేశ్వరాలయంలోని పాండ్యరాజ శాసనంలో— "స్వస్తి శ్రీ శకవర్షంబులు 1080 అగునేటి ఉత్తరాయణసంక్రాంతి నిమిత్తమున శ్రీ మన్మహామండలేశ్వర పాండ్యరాజు ఒంగేరు మాన్యములోని గుంటూరి శ్రీ యగస్త్యేశ్వర మహాదేవరకు గుడియును మండపమును పరివారపు గుళ్లును ప్రాకారమును గోపుర సహితమైన గుళ్లెత్తించి యాదేవరకు హవి బలియర్చనలకు మానులకు సానులకు నట్టువునికి మద్దెలకారుకు మోకరికి వాంశికులకు శిల్పికాచార్యునికి కెంపులవారిని బెరిసిన దేవర పరిమూటము వారికి గడ్డిపూండివలయ చుట్టుపోలము చతుశ్నీమము (మధ్య) ఆ చంద్రార్కస్థాయిగ విచ్చితిమి." అని ఉంది. ఈ గడ్డిపూడిగ్రామం ఒకప్పుడు ఉండి ఉండాలి.

గుంటూరు చాలా పాతది—పాత గుంటూరు పాతది. అక్కడే తిక్కన ఉండేవాడు. తిక్కన వంశీయులకు గుంటూరు కరిణీకం ఉండేది. తిక్కన తన నిర్వచనోత్తర రామాయణంలో "సార కవితాభిరామ గుంటూరు విభుని మంత్రి భాస్కరు మల్లితామహుని దలచి" అని వ్రాసుకున్నాడు. ఆంధ్ర భారతంలోకూడా "పూరిమి తమ్మడు గుంటూరు విభుడు కొమ్మన దండనాథుడు" అని తెల్పాడు.

రాజావాసిరెడ్డి రామలింగం, 1718 లో కొలచెలమ జగన్నాథావధానులు, గుండు వరసావధానులు అనే ఇద్దరు పండితులకు 30 కుచ్చెళ్లభూమినిచ్చాడు. తర్వాత ఈ రాజా మనమడు రాజా జగ్గన్న మరో ఆరు కుచ్చెళ్ల భూమిని వెల్లంకి సీతారామశాస్త్రిఅనే ఆయనకు దానంచేశాడు, తన తాతగారు ఇద్దరు పండితులకు ఇచ్చిన చోటునే. అదంతా కలిపి ప్రస్తుతం "అగ్రహారం" అయింది. ఇదేకాలంలో అగ్రహారానికి తూర్పున చాకలిసంగని జ్ఞాపకార్థం సంగడిగుంట అనే చెరువు కూడా ఏర్పాటయింది.

1763 ప్రాంతంలో మహమ్మదీయులు వచ్చి యెర్రచెరువుకు నైరుతి భాగంలో ఇళ్లు, పెద్దమసీదు కట్టుకున్నారు. ఆ రోజుల్లో నల్లచెరువుకు ఉత్తరభాగాన చింతపల్లి జమీందార్ల నివాసాలు ఏర్పరచుకున్నారు అదంతా నేటి కొత్తపేట ప్రాంతం అయింది. 1788 నుంచి పట్టణంపైన బ్రిటిషువారి ప్రత్యేకపాలన ప్రారంభమయింది, కొత్త కొత్త కచేరీలు, హడావుడిఎక్కువవటంవల్ల పట్టణంలో ఇళ్లు జనసంఖ్య పెరగసాగాయి కాని 1823 లో దాదాపు గుంటూరును అంతా అగ్నిదేవుడు తుడిచిపెట్టేశాడు. 1832 లో వచ్చిన డొక్కల కరువులో గుంటూరివారి డొక్కలు కూడా చేరాయి. ఆ కరువులో చచ్చిన జంతువుల్ని తినటం అటుంచి, ఒక బతికి ఉన్న గాడిదను కొందరు చీల్చుకొని తినేసినట్లు ఒక విదేశీయుడు వ్రాశాడు. డొక్కలమ్మ గుంటూరు జనంలో మూడోవంతును పొట్టన పెట్టుకుంది. ఆ విడపోయిన వెంటనే మహామారి సపరివారంగావచ్చి మరోభాగం జనాన్ని తినేసి, మిగిలినవారికి ఆరోగ్యం చిహ్నాలుకూడా ఏకోనానాలేకుండా చేసిపోయింది. తర్వాత ప్రసన్నమాములుగా దవుడేకని పెట్టవున్నాడు.

ఫాదర్ హేయర్ 1844 లో వచ్చి చర్చినొకదాన్ని స్థాపించాడు— రెవరెండ్ గర్ అనే మరొక మతప్రచారకునితో కలిసి ఒక పాఠశాలకూడా స్థాపించాడు. అదపెరిగి నేటి ఆంధ్ర క్రిస్టియన్ కళాశాల అయింది.

గుంటూరు 1866 లో మునిసిపల్ పట్టణంగా ప్రకటించబడింది అంతకు ముందు చాలా గంద్రగోళంగా, మరీ అస్తవ్యస్తంగా ఉండేది. మునిసిపాలిటీ కొకపూర్వం కేతరాజు జగన్నాథరావు అనే ఒక అగ్రహారీకుడు ప్రజలు తాగటానికి ఒక మంచినీటి కోనెరును తవ్వించాడు గుంటూరుకు మొదట రైలు 1888 లో వచ్చింది. 1890 లో అప్పటి కలెక్టరు పేరిట అరండల్ పేట నిర్మాణం ప్రారంభమయింది. అలాగే 1906 లో బ్రాడీపేట యేర్పాటవారంభించింది.

గుంటూరు, కృష్ణాజిల్లాలో ఒక భాగంగా వుండేది కాని 1904 నుంచి ప్రత్యేకజిల్లాకు ముఖ్యపట్టణమయింది. అంతకుముందె సంగంజాగర్లమూడి దగ్గర నుంచి, గుంటూరు పట్టణానికి మంచినీటి సప్లయిచేసే ఏర్పాట్లు ప్రారంభమయ్యాయి. 1906 లో 20 వేల ప్రజలకు మంచినీటి సప్లయి ఏర్పాటు చేయబడింది జనసంఖ్య పెరిగిపోసాగింది నీటిఖర్చు ఎక్కువయింది. బావుల నీరు మరీ పాతాళానికి పోసాగింది. 1908 నాటికే ఈ జంగమర్లమూడి నీటి సప్లయి సరిపోదు అని రూఢి అయింది. నీటికుళాయిలదగ్గర ఆవేశంగా అమ్మలక్కలు చేరటం, నీటికోసం అదుర్దాపడటం సర్వసామాన్య దృశ్యం.

## శ్రీ విష్ణుభొట్ల సూర్యనారాయణగారు

నీళ్లులేకపోయినా, ఊరు పెరగటం ఆగలేదు. ఊరిలో విద్యాభివృద్ధి ఆగలేదు. నాటకసమాజాలు, క్లబ్బులు, విద్యాలయాలు అనేకం ఉద్భవిస్తూనే ఉన్నాయి. దేశస్వాతంత్ర్య సమరంలో గుంటూరు పట్టణం వహించిన పాత్రను గుంటూరువారు సగర్వంగానే చెప్పవచ్చు. గుంటూరులో గొప్ప దేశభక్తులుండటమే గాక, మహాదేశభక్తి ఇంటింటా ప్రజ్వరిల్లింది. ఉప్పుసత్యాగ్రహంలో గుంటూరు పురపాలక సంఘమే రూ 116 పెట్టి ఉప్పు తెచ్చుకున్నది; దేశంలో జాతీయపతాకానికి అధికార పూర్వకాభివందనం చేసింది గుంటూరు పురపాలక సంఘమే.

అదంతా గతంలో కొంత. ఆంధ్ర దేశంలో, న్యాయవాదులు సంబంధించినంతవరకు గుంటూరు పట్టణం సంపాదించిన పేరు. తక్కువదికాదు. ఆ పేరు యీ నాటికీ నిలబడిఉంది.



పేటికి మన ఆంధ్ర హైకోర్టు రావటం ఉచితంగానే ఉంది.

కాని ఊరిని ఒకతీరులో—నిర్మించటం, సరిదిద్దటం బగ్గిరా జరగటం వెంటనే జరగాల్సినపని. ఒక్క బ్రాడీపేట, అరండల్‌పేటలు, కొత్తగా కట్టిన్న పేటలుతప్ప మిగిలినపేటలు, పారిశుధ్య వ్యవస్థకు దూరంగాఉన్నాయి. ఊరిలో విద్యావసతు లున్నాయి కాబట్టి విద్యార్థులెక్కువ. ఇకనుంచి న్యాయవాదులుకూడా ఎక్కువ. జిల్లా ముఖ్యస్థానంకాబట్టి, పొగాకు వ్యాపార కేంద్రంకాబట్టి, గుంటూరుకు అతిథులసంఖ్య ఎక్కువ. హైకోర్టు రాకతో అది మరీ ఎక్కువవుతుంది. ఆరేళ్ళనుంచి సంగం జాగర్లమూడి నుంచి నీటిసప్లయిచేసే ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆ నీరు రెండుమూడేళ్లలో ప్రజలకు పూర్తిగా అందుతాయి అని ఆశిద్దాం. కాని అందుకుతోడుగా పారిశుధ్యం ఎలా అభివృద్ధి జరుగుతుందో పెద్దలు ఆలోచించాలి. అది లేనిదే—పట్టణంలో ఏదో పెద్దలోపం కనిపిస్తూనే ఉంటుంది.



# ప్రత్యేక హైకోర్టు అవతరణ: ఆంధ్రుల గురుతర బాధ్యతలు

రచన: శ్రీ పాటిబండ్ల సుందరరావు



సృష్టిలో చరాచరములను సృష్టించుట ఒకటి: సూర్యుని సృష్టించుట ఒకటి: అట్లే రాష్ట్ర నిర్మాణములో ఇతర రాష్ట్రములను నెలకొల్పుట ఒకటి, హైకోర్టును స్థాపించుట ఒకటి. రాష్ట్రములో హైకోర్టు ఒక అంగమైనప్పటికీ, దానికి అధికతర ప్రాధాన్యము గలదు. సూర్యుడు లేనిదే జగత్తు భాసించనట్లు, హైకోర్టు లేనిదే రాష్ట్ర వ్యవహారము సాగదు.

సూర్యుడు 'బహు బృహద్విశ్వకార్య'సాధన సమర్థుడు. సూర్యుని వల్ల ఋతువులు సక్రమముగా నడుచును కాలము వ్యత్యాసము లేకుండును. వర్షములు కురియును, సస్యములు పండును, పర్వతములు ఎగురకుండా స్థిరముగా నుండును. సముద్రము కట్టను దాటదు. అట్లే లౌకికవ్యవహారములో, రాష్ట్ర పాలనా పద్ధతిలో, హైకోర్టు అనేక విధములనుపకరించును.

వస్తువు ఒకటేయైనను, వివిధ ప్రజలకు వివిధరీతుల కనబడుట లోకస్వభావము. మహాభారతమును గురించి ప్రసిద్ధపద్యము అందరకు తెలిసినదే: ధర్మతత్త్వజ్ఞులు, ధర్మశాస్త్రంబని, యాధ్యాత్మవిదులు వేదాంతమని యు, నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులుమహాకావ్యమనియు, లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని ఐతిహాసికులితిహాసమనియు, బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని.., అట్లే గుంటూరిలో యవతరించిన హైకోర్టు ఒక్కొక్కరికి ఒక్కొక విధముగా కనబడును. ఇండ్లుకలవారికి, అద్దె లువచ్చునవియు, అద్దెలున్న వారికి ధరలు పెరుగునవియు, ఇట్లే అనేకులకు అనేక విధములు తోచుచుండును.

ప్రకృతము, న్యాయవాదుల విషయముగనుక, హైకోర్టు, వారికెట్లు కనబడునో, వారి ప్రస్తుత దృక్పథము నెట్లు మార్పులేమైనను కలిగించునో చూడవలసియున్నది.

'ఒక రత్నంబు విచర్చనీయమై యుండునప్పుడు సాహిత్య ప్రయోజనము ప్రభవించు చున్నదని' [illegible]

[illegible]

టలో ఆశ్చర్యముండదు.

ఈకీ అటులుంచి, నిజముగా రాష్ట్రమంతటను ఉన్న న్యాయవాదులకు అధికతరార్థిక కవకాశ మున్నదా?

దీనికి సమాధానము ఇచ్చుట దుష్కరము. సమాధానమిచ్చుట నిర్బంధించి నచో మార్పుండదేమోనని చెప్పవలసి యుండును

[illegible]

చున్నది. వ్యవహారకర్కశత, న్యాయజ్ఞ గ్రస్తమైన ఆస్తివిలువ, వీటినిబట్టిన్నీ, హైకోర్టులో దిగ్దంతులవంటి న్యాయవాదులుండుట బట్టియు, హైకోర్టుమర్యాదలు సాంప్రదాయములు చక్కగా తెలిసి యుండుటను బట్టిన్నీ, తన వ్యవహారము శ్రేష్ఠతముడైన న్యాయవాది నిర్వహించవలెనని పార్టీకి సహజముగానుండు కోరికచేతను, అప్పీళ్లనువారి కరగత మొనర్చుట జరుగుచుండెడిది. హైకోర్టు గుంటూరు వచ్చినందున ఆకొంగమున్నప్పుడు లేదంటున్నా? అనుటకు వీలులేదు. హైకోర్టుతోపాటు అచ్చటి న్యాయవాదులు అనేకులు, సమర్థులు, ఎవరి ప్రాక్టీసుతో వారు వచ్చి యున్నారు. హైకోర్టులో పనియొక్క స్వభావము, ఇతర కోర్టులలో పనియొక్క స్వభావము వేరు పరిశ్రమ వేరు న్యాయశాస్త్ర జ్ఞానమువేరు. క్రింది కోర్టులకు లేని, అనేక విషయములలో హైకోర్టుకు అధికారముకలదు. ఆ విషయములలో, మద్రాసువారికి పరిచయముమెండు. ఇన్ని ప్రతిబంధకము లుండగా, ఎందుకింత సంబరమని అడుగవచ్చును. దానికి సమాధానములేకపోలేదు. మద్రాసులో హైకోర్టు ఉన్నప్పటికంటె, గుంటూరులోనున్నప్పుడు క్రొత్తతరమునకు చెందిన తెలుగున్యాయవాదులకు ఎక్కువ ముందికి అవకాశముకేను ప్రాతలవాట్లు మాసుకొని, క్రొత్తమర్యాదలను నేర్చుకొనగలవారు, మద్రాసు న్యాయవాదులలో సమానమైన శాస్త్రజ్ఞాన సంపాదనకుకష్టపడుటకుసిద్ధపడనవారు కూడా హైకోర్టులో ప్రాక్టీసుచేయుటకు అవకాశములుకలిగినవి. ఇంకొక విషయము గలదు ప్రతిప్రతిభావంతుడైన ప్రాక్టీసుకరుకు, జడ్జిపదవిని కాంక్షించుటకవకాశ సహజము. అట్టి వారలకెక్కువముందికి ఇక ముందు న్యాయస్థానములనలంకరించుట సాధ్యమైయుండును.

ఒక ప్రశ్న అడుగవలసి యున్నది ఆంధ్ర హైకోర్టు, మద్రాసు హైకోర్టు [illegible] యశస్సును సంపాదించగలదా? [illegible]

స్వతస్సి ప్రమాణ్య పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణమహీంమహీశాః

# జిల్లా కేంద్రాలలోని న్యాయవాద సంఘాలు

## అనంతపురం

1920 వ సంవత్సరం జనవరి 1 వ తేదీన జిల్లా కోర్టుతోపాటు న్యాయవాదుల సంఘం ప్రారంభించబడింది. 20 మంది సభ్యులమాత్రమే ఉండేవారు. ప్రారంభంలో కీ॥ శే॥ ఎస్. అంజనేయులుగారు అధ్యక్షులుగా ఉండేవారు.

ఈ నాడు సంఘంలో 80 మంది సభ్యులున్నారు. టి. చిదంబరయ్యగారు (అధ్యక్షుడు), జి. సదాశివరెడ్డి గారు (కార్యదర్శి).

అనంతపురంలో శ్రీ ఎమ్. మల్లిరెడ్డి గారు ప్రస్తుతం పబ్లిక్ ప్రాసిక్యూటరుగా ఉంటున్నారు.

## కడప

కడప న్యాయవాదులసంఘం దాదాపు అరవయ్యేండ్ల క్రిందట ఏర్పడింది. ఈ సుదీర్ఘచరిత్రలో కడప న్యాయవాదుల సంఘసభ్యులు రాయలసీమ ప్రజలకు చాలా సేవచేశారు. కడప జిల్లాకోర్టు పర్యవేక్షణలో చాలా ప్రాంతం ఉండడంవల్ల తొలిరోజులలో కడప న్యాయవాదులకు ఇతర జిల్లాలలోని న్యాయవాదులతో కూడా సన్నిహితసంబంధాలుండేవి. 1921 వ సంవత్సరానికి పూర్వం కడప జిల్లాకోర్టు సివిల్ వ్యాజ్యాల విచారణాధికారాలు అనంతపురంజిల్లాలోని గుత్తి తాడిపత్రి తాలూకాలవరకూ ఉండేవి. తరువాత మరో పది సంవత్సరాలకు చిత్తూరుజిల్లాలోని మదనపల్లి, వాయల్పాడు తాలూకాలుకూడా ఈ కోర్టు అధికారంలోకి వచ్చినవి.

ఈ సంఘం పదిమంది సభ్యులతో ప్రారంభమయినట్లు కనిపిస్తుంది. ఈనాడు ఈ సంఘంలో సుమారు 70 మంది సభ్యులున్నారు.

సంఘసభ్యుల అభిరుచులూ, ఆసక్తులూ బహుముఖంగా ఉంటవి. ప్రజాహిత సేవారంగంలో మొదటి రోజులలో వీరు వినుతికెక్కినారు. పూర్వకాలంలోని శాసనసభా కౌన్సిల్సులోనూ, ఇటీవల యేర్పడ్డ శాసనసభలలోనూకూడా ఈ సంఘసభ్యులు సభ్యులుగా వుండేవారు. పూర్వపు శాసనసభా కౌన్సిళ్ళల్లో శ్రీయుతులు టి. ఎమ్. నరసింహాచార్, ఆర్కాట్ పరశురామరావ్, బి. పి. దేవరాజులు నాయుడు, జి. రామేశ్వరరావ్ (అంటే ప్రస్తుతం ఆంధ్రప్రభుత్వ న్యాయశాఖ సహాయ కార్యదర్శి జి. జి. రావ్‌గారి తండ్రి) గారలు సభ్యులుగా వుండేవారు. శాసనసభా కౌన్సిలు సభ్యులుగా కీ॥ శే॥ శ్రీ బి. అనంతరావ్, డి. రామసుబ్బారెడ్డి గారలు సభ్యులుగా పనిచేశారు. నవరాజ్యాంగంలోకూడా కడప న్యాయవాదుల సంఘసభ్యులకు ప్రాతినిధ్యం లభించింది. ప్రస్తుతం ఆంధ్రప్రభుత్వ రెవిన్యూమంత్రిగావున్న శ్రీ కె. కోటిరెడ్డి బార్-ఎట్-లా గారు కడప న్యాయవాదులలో ప్రముఖులుగా వుండేవారు. అవిభక్తమద్రాసురాష్ట్రంలో పబ్లిక్ వర్కు్స్ శాఖ మంత్రిగా పనిచేసిన ఎస్. రంగారెడ్డిగారు కడప న్యాయవాదియే.

ఈజిల్లానుంచి మొట్టమొదటిసారిగా పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికయిన పి. బాసిరెడ్డిగారు కడప న్యాయవాది సంఘ సభ్యులే.

స్థానిక పరిపాలనా రంగంలో కూడా ఈ సంఘసభ్యులు ప్రముఖ పాత్రను నిర్వహించారు. కీ॥ శే॥ టి. ఎమ్. నరసింహాచార్, కీ॥ శే॥ డి. రామసుబ్బారెడ్డిగారలూ, శ్రీ సి. ఎల్. నరసింహారెడ్డి, ఎన్.రంగారెడ్డి, టి. పుల్లారెడ్డిగారలూ అనేకసార్లు జిల్లాబోర్డు అధ్యక్షులుగా ఎన్నికయి సమర్థనీయంగా పనిచేశారు. పురపాలకసంఘ రాజకీయాలుకూడా ఈ సంఘసభ్యులను ఆకర్షించినవి. కడప పురపాలక సంఘం అధ్యక్షులుగా పనిచేసి వినుతికెక్కినవారిలో కీ॥ శే॥ శ్రీ బి. పిచ్చయ్య, కీ॥ శే॥ శ్రీ పి. లక్ష్మీనారాయణశాస్త్రి, కీ॥ శే॥ శ్రీ బి. వసంతరావ్, శ్రీ పాలెం ముద్దుకృష్ణయ్య నాయుడు ప్రభృతులు ముఖ్యులు.

1942 స్వాతంత్ర్య సమరంలో కూడా కడప న్యాయవాద సంఘసభ్యులు పాల్గొన్నారు. కీ॥శే॥ శ్రీ డి. రామసుబ్బారెడ్డి, శ్రీయుతులు ఎస్. సుబ్బారావ్, ఎస్. సంపతిశాస్త్రి, టి. పుల్లారెడ్డి, ఎన్.రంగారెడ్డి, కె బి. నారాయణరెడ్డిగారలు సత్యాగ్రహం చేసి జైలుకు వెళ్ళారు.

కడప వైజ్ఞానిక, సాంఘిక, సాంస్కృతికాభివృద్ధికి న్యాయవాదులు అవిరళకృషి చేశారు.

అనేకమంది కడప న్యాయవాదుల సమైక్యకృషి ఫలితంగానే ప్రముఖ విద్యాసంస్థ రామకృష్ణ మిడిల్ హైస్కూలు నెలకొల్పబడింది. శ్రీయుతులు టి. ఎమ్ శేషాద్రి, బి. రాధాకృష్ణయ్య, బి. బి. శేషాచార్లు, ఆర్.రంగనాథం, సంజీవరెడ్డి, ఎన్. సుబ్బరామయ్యగారలను ఈ సందర్భంలో ప్రస్తుతించాలి. ఇది నిజంగా ప్రశంసనీయమైన కృషి.

కడప సాంస్కృతిక జీవితానికి రామకృష్ణసమాజం కేంద్రం. దానిలో క్రూడా అనేకమంది న్యాయవాదులకు సంబంధం వున్నది. ఈ సమాజం కార్యకలాపాలలో న్యాయవాద సంఘం అధ్యక్షులు బి. రాధాకృష్ణయ్యగారు ఎక్కువ శ్రద్ధవహిస్తున్నారు.

శ్రీయుతులు పి. నారాయణరెడ్డి, కె. లక్ష్మణరావ్, టి. ఎమ్. శేషాద్రి, పి బాసిరెడ్డిగారలు కడపలోని సహకారోద్యమ నాయకులలో ప్రముఖులు. టి. ఎమ్. శేషాద్రిగారి కృషి ఫలితంగానే కడప సహకార గృహనిర్మాణపథకం చాలావరకు చక్కటి కాలనీగా రూపొందింది. న్యాయవాది శేషాద్రిగారు ఆ సంఘానికి గౌరవ కార్యదర్శి.

లోగడ ఈ పట్టణంలో న్యాయవాదులుగా పనిచేసి కీర్తిప్రతిష్ఠల నార్జించినవారిలో కీ॥ శే॥ వి. రామచంద్రరావ్ గారు, శ్రీయుతులు వి. వసంతరావ్, ఎన్. సుబ్బారెడ్డి, టి. ఎమ్. నరసింహాచార్, జి. రామేశ్వరరావ్, కె గుండూరావ్ ప్రభృతులు ప్రముఖులు.

ఇప్పటి న్యాయవాదులలో వినుతికెక్కినవారిలో ఏలూరు సెషన్సుజడ్జి శ్రీ జి. నాగిరెడ్డి, ప్రస్తుతం ఆంధ్ర ప్రభుత్వ న్యాయశాఖ సహాయ కార్యదర్శిగా పనిచేస్తున్న శ్రీ జి. జి. రావ్ బార్-ఎట్-లా ప్రభృతులు ప్రముఖులు.

కడప న్యాయవాదులు ఆర్థిక,వైజ్ఞానికాభివృద్ధికి నిరంతరం కృషిచేస్తూ వచ్చారు. కడప ఆర్ట్సుకాలేజి కొంతవరకు వారికృషి పర్యవసానమే ననవచ్చు.

కడప యునైటెడ్ క్లబ్ న్యాయవాదులు ఏర్పాటుచేసినదే. ఈనాడు కడప సాంస్కృతిక జీవితంలో దానికి ప్రముఖస్థానం ఉన్నది.

ఆంధ్రకు ప్రత్యేకంగా హైకోర్టు ఏర్పడుతున్న ఈ శుభసమయంలో తమ భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉండగలదని ఈ సంఘంవారు ఆశిస్తున్నారు. ఈ సంఘసభ్యుల నిరంతర అవిరళకృషి ఫలితంగా విశాలాంధ్రలో యీ సంఘంవిశిష్టస్థానాన్ని అలంకరించగలదు.

## చిత్తూరు

చిత్తూరు న్యాయవాదుల సంఘం చాలా పురాతనమైంది. 1920 వరకూ ఉత్తర ఆర్కాట్, చిత్తూరు జిల్లాలు చిత్తూరు కేంద్రంగా ఒకే న్యాయశాఖా ఆధ్వర్యంలో ఉండేవి.

ప్రస్తుత జిల్లాకోర్టుకు 110 ఏళ్ళకు పైగా వయస్సు ఉంటుంది. దీనికి పూర్వం ఈస్టు ఇండియా కంపెనీ రోజులలో సాదర్ దివానీ అదలత్ కోర్టు ఉండేది. ఆ కోర్టులో జిల్లా జడ్జి, ఒక 'పండిత్', ఒక 'మౌల్వీ' ఉండేవారు. మూడుస్థానాలలో అమర్చబడ్డ న్యాయవేదిక దానికి గుర్తుగా కనిపిస్తుంది.

ఈ న్యాయవాదులలో డాక్టరు శ్రీ సి. ఆర్ రెడ్డి తండ్రిగారైన కట్టమంచి సుబ్రమణ్యరెడ్డి, ఎల్. ఏ. గోవింద రాఘవ అయ్యర్, టి. వరసింగరావు, టి. టి. వీరరాఘవాచారియార్, జి. శ్రీనివాసాచారి, ఇ. సూర్యనారాయణ బి. మునిస్వామి నాయుడు, బి. సి. రాఘవయ్య, పి. దొరస్వామి అయ్యంగార్, టి. ఎన్. రామకృష్ణారెడ్డి, టి. ఎ. రంగాచారి, ఇ. చెంగల్‌రావు గారలువంటి ప్రముఖులు ప్రధానపాత్ర వహించారు.

ఇదివరకు న్యాయవాద వృత్తిలో కృషిచేసిన వారిలో లోక్ సభ డిప్యూటీ స్పీకర్ ఎమ్. అనంతశయనం అయ్యంగార్, ఆర్. బి. రామకృష్ణరాజు, కె. వరదాచారి (చిత్తూరు న్యాయవాదుల సంఘ అధ్యక్షుడు), టి. కె. వీరాచారియర్, సి. వెంకట్రమణ అయ్యర్ గారలు నేటికీ రాజకీయవేత్తలుగా, న్యాయవాదులుగా వ్యవహరిస్తున్నారు. ప్రముఖ దివ్యజ్ఞాన ప్రచారకులు పి. ఆర్. పార్థసారథి గారుకూడా ఒకప్పుడు ఈ సంఘంలో ఉన్నారు.

ప్రస్తుత సుప్రీమ్‌కోర్టు జడ్జి శ్రీ బి. జగన్నాథదాసుగారుకూడా 1942 లో ఈ సంఘంలో సభ్యులుగా చేరారు. ఆంధ్ర హిందూ దేవాదాయ, ధర్మాదాయ సంస్థల కమీషనర్ ఆర్. వెంకటరెడ్డి, మునికన్నయ్యనాయుడు, బి. టి. రంగస్వామి అయ్యంగార్ గారలు కూడా సంఘసభ్యులుగా ఉండేవారు.

న్యాయమూర్తులు బి. సోమయ్య, ఎన్. చంద్రశేఖర అయ్యర్ గారలు ఈ జిల్లా నివాసులే.

ఈ జిల్లానుంచి డి. శ్రీనివాస అయ్యంగార్, కె. సి. వెంకటరాజు గారలువంటి న్యాయవాదు లెందరో జాతీయ ఉద్యమంలో పాల్గొన్నారు.

ప్రస్తుతం చిత్తూరు న్యాయవాదుల సంఘంలో ఈ క్రిందవారు ఉన్నారు: కె వరదాచారియర్, ఎమ్. ఎల్. ఏ. (అధ్యక్షుడు), ఎమ్. ఎన్. ఎస్. రాఘవన్ (ఉపాధ్యక్షుడు), కె సుబ్బరామయ్య (కార్యదర్శి), కె. సి. వరదాచారి (సంయుక్త కార్యదర్శి), బి మునిస్వామినాయుడు, (ట్రెజరియన్) గారలు.

## నెల్లూరు

1889 లో నెల్లూరు న్యాయవాదుల గ్రంథాలయంగా నెల్లూరు న్యాయవాద సంఘం ప్రారంభమయింది. ఆ తరువాత రెండు సంవత్సరాలకు ఆ సంస్థకు ఇప్పటి "నెల్లూరు న్యాయవాదుల సంఘం" అనే పేరు వచ్చింది 14-9-1917 న సొసైటీల రిజస్ట్రేషన్ చట్టం ప్రకారం ఈ సంఘాన్ని రిజస్టర్ చేయించారు. డాక్టర్ అల్లాడి కృష్ణస్వామి గారి అధ్యక్షతన 1940 ఏప్రిల్ 13,15,14



ఆంధ్ర న్యాయమూర్తులు శ్రీ కోకా సుబ్బారావుగారు (ప్రధాన న్యాయమూర్తి)



శ్రీ పి. చంద్రారెడ్డిగారు.



శ్రీ కె. ఉమామహేశ్వరంగారు.

తేదీలలో ఈ సంఘం స్వర్ణోత్సవం జరిగింది. కీర్తిశేషులు రావ్ బహద్దూర్ ఏ. ఎస్. కృష్ణారావ్ గారు ఆ ఉత్సవాలకాలూకు ఆహ్వానసంఘం అధ్యక్షుడుగా పనిచేశారు

నెల్లూరులో వుండి న్యాయవాద వృత్తిచేసేవారికే, నెల్లూరులో నివాసం వుండని న్యాయవాదులకూ ఈ సంఘంలో సభ్యత్వం వుంటుంది. డాక్టరు అల్లాడి కృష్ణస్వామి, సుప్రీమ్ కోర్టు న్యాయమూర్తిగా పనిచేసి విశ్రాంతి తీసుకొన్న యన్. చంద్రశేఖర య్యర్, మద్రాసు హైకోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ బి. సోమయ్య ప్రభృతులు నెల్లూరులో వుండకుండా వృత్తిచేసిన న్యాయవాదులలోని వారు. నెల్లూరులో నివసిస్తూ వృత్తిచేసి కీర్తిశేషులయిన న్యాయవాదులలో శ్రీయుతులు ఎఫ్. టి. వార్ప్, టి. వి. వెంకట్రామయ్యర్, ఎస్. వెంకటేశయ్య, వేదం వెంకటాచలయ్య, ఎ. ఎస్. కృష్ణారావ్ పంతులు, అన్నస్వామి అయ్యర్, ఓ. వెంకటరంగయ్య పంతులు, ఎమ్. చంగయ్య, మహమ్మద్ యహతీసాహెబ్, శబాల సుబ్బారాయుడు ప్రభృతులు ప్రముఖులు వారందరూ ప్రత్యేకాంశాలలో నిపుణులుగా మేధాశక్తి సంపన్నులుగా న్యాయశాస్త్ర ప్రవీణులుగా వినుతికెక్కినారు

నెల్లూరు న్యాయవాద సంఘంలో అనేకమంది సభ్యులు అనేక ఉన్నత పదవుల నలంకరించారు. శ్రీ యాహ్యా అలీ హైకోర్టుజడ్జిగా పనిచేశారు. శ్రీయుతులు అద్దంకి వెంకట్రామయ్య, సింగరాజు వెంకటసుబ్బారావ్, ఎమ్. అనంతగిరిరావ్, ఎమ్. బలరామరెడ్డి, ఎమ్. రామచంద్రరావ్ నాయుడు, దర్శి చెంచయ్య శ్రేష్ఠిగారలు జిల్లా జడ్జి లయినారు.

నెల్లూరుజిల్లాకు చెందిన పి. చంద్రారెడ్డిగారు ఈనాడు ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తి. లండన్ లోని ప్రివీ కౌన్సిల్ లో వాదించే అపూర్వావకాశం ఎ. ఎస్. కృష్ణారావ్ గారికి లభించింది ఇంకా అనేక ఉన్నత పదవులను ఆయన అధిరోహించారు. మద్రాసు రాష్ట్ర శాసనసభలో సభ్యత్వం సంపాదించిన మొదటి నెల్లూరు పౌరుడు కృష్ణారావుగారే. మొట్టమొదటిసారిగా అనధికార నెల్లూరు జిల్లాబోర్డు అధ్యక్షుడుగా సుమారు పన్నెండు సంవత్సరాలు ఆయనపని చేశారు. ఆంధ్రప్రభుత్వ న్యాయవాది ఎమ్. శేషాచలపతిగారి తండ్రి ఎమ్. చెంగయ్య పంతులుగారు నెల్లూరు పురపాలక సంఘం అధ్యక్షుడుగా కొన్ని సార్లు ఎన్నికయారు. మద్రాస్ మతాదాయ దేవాదాయాలశాఖ కమీషనరుగా కూడా ఆయన పనిచేశారు.

ఏడాదికొకసారి ఎన్నికయ్యే కార్యవర్గం నెల్లూరు న్యాయవాద సంఘం కార్యకలాపాలను నిర్వహిస్తుంది. కార్యవర్గ సభ్యులలో ఒకరిని కార్యదర్శిగా ఎన్నుకొంటారు. అధ్యక్షుడుండడు. ప్రస్తుతం ఆర్. వి. గోవిందరావ్ గారు ఈ సంఘ కార్యదర్శి. ప్రస్తుతం ఈ సంఘ సభ్యులలో శ్రీయుతులు టి. శివరామయ్య, సి. కాలకొండయ్య, బి. రామేశ్వరయ్య ఆర్. దశరథరామరెడ్డి, కె. విశ్వనాథరావ్, ఎమ్. వి. సుబ్బారావ్ పంతులు. పి. వి. కృష్ణయ్య (గవర్నమెంట్ ప్లీడరు), ఆర్. ఎ. అన్నాది (పబ్లిక్ ప్రాసిక్యూటర్), ఎమ్. ఎ. శేషారెడ్డి, కె. వి. రమణారెడ్డి ప్రభృతులు ప్రముఖులు.

ఏటేటా యీ సంఘం జరిపే సభలకు ఈ జిల్లాకు చెందని వారు అధ్యక్షత వహిస్తుంటారు ఈ యేడు జరిగిన వార్షికోత్సవ విందుకు న్యాయమూర్తి కె ఉమామహేశ్వరంగారు అధ్యక్షత వహించారు ఆయనకొన్ని [illegible] ఆ సందర్భంలో డాక్టర్, [illegible]డి కృష్ణస్వామిగారి సతీమణి [illegible]

సుప్రీమ్‌కోర్టు మాజీ న్యాయమూర్తి పతంజలిశాస్త్రిగారు ఆవిష్కరించారు ఈ యేడు ఈ సంఘంవారు వజ్రోత్సవం జరపాలను కొంటున్నారు.

## మచిలీ పట్టణము

దక్షిణ భారతములో మచిలీపట్టణము చరిత్రాత్మకమయిన పురాతన పట్టణమయి వున్నది. యీ పట్టణము కలంకారీ బట్టలు తివాసీలు యిత్యాది గృహ పరిశ్రమలకు ఆటపట్టయి, కలకత్తాలగాయితు దక్షిణము జాఫ్నా వరకు దేశవాలీ ఓడలమీద సరకులు ఎగుమతి దిగుమతి చేయు విస్తారమగు వర్తక వ్యాపారము చేయు రేవు స్థలమయి వుండెను. ఈ రేవు సౌకర్యములను బట్టి పాశ్చాత్య వ్యాపారస్తులు బందరులో వర్తక స్థానములు యేర్పరచుకున్నారు ఇంగ్లీషువారు వర్తకులుగా వచ్చి రాజ్యము సంపాదించి పరిపాలన ప్రారంభించినది లగాయతు బందరు ఉత్తర సర్కారులకు రాజధానిగా యేర్పడిన కారణముచేత యిచ్చటనే సదరు అదాలతు కోర్టు యేర్పడి దరిమిలా జిల్లా కోర్టు స్థాపించబడినది. బ్రిటిషు ప్రభుత్వము స్థిరపడిన దాదిగా బందరులో కోర్టులు, వకీళ్లు యేర్పడి దక్షిణ భారతములో ప్రముఖులయిన న్యాయవాదులు దేశమంతట పేరు ప్రఖ్యాతులుగాంచినారు. 1905 సంవత్సరము వరకు ప్రస్తుత గుంటూరు జిల్లా ప్రదేశము కూడా కృష్ణా జిల్లాలో భాగముగా యుండి, బందరులోని జిల్లా కోర్టు గోదావరి నదికి నెల్లూరు జిల్లాకు మధ్య ప్రదేశమంతటికి ముఖ్య న్యాయస్థానమయి వుండెను. యిత్యాది కారణముల వల్ల బందరు న్యాయవాదులు ధర్మశాస్త్ర ప్రవీణులనియు రాజకీయ ప్రవర్తనులనియు సంఘసేవా పరులనియు ప్రఖ్యాతి గాంచినారు. వారిలో కీర్తిశేషులయిన సింగరాజు సుబ్బారాయుడుగారు, పురాణం వెంకటయ్యగారు, అన్నవరపు వుండవల్లి కొత్తయ్యగారు అయ్యంకి సుబ్బారాయుడుగారు, వడ్లమన్నాటి దామోదరయ్యగారు, అయినవోలు వెంకటరెడ్డి నాయుడుగారు వావిలాల శివావధానిగారు, దివాన్ బహద్దూరు వారణాసి సుబ్రహ్మణ్యంగారు ప్రథమ శ్రేణికి చెందినవారు. వారలు సంపాదించిన పేరు ప్రఖ్యాతిని యినుమడింప చేసి ఖ్యాతిగాంచిన వారలలో ముఖ్యులు- వేమవరపు రామదాసు పంతులుగారు, కొండా వెంకటప్పయ్యగారు, కోడంబి హనుమంత రావుగారు వల్లూరి సూర్యనారాయణ రావుగారు వేమూరి రామచంద్ర రావుగారు వడ్లమన్నాటి నరసింహం గారు,-పురాణం కృష్ణమూర్తిగారు, జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారు- J- D- Samuel గారు యిత్యాదులు- న్యాయవాద వృత్తిలో మదరాసు - న్యాయవాదులకు విజ్ఞానములోగాని నైతిక ప్రవర్తనలోగాని లేశము తీసిపోరని పేరుగాంచినారు.

1926 సం. ము నుండి నేటివరకూ సంఘాధ్యక్షులు, కార్యదర్శులు యీ దిగువ పేర్కొనబడెరి:

1926 అధ్యక్షులు పురాణం కృష్ణమూర్తిగారు. కార్యదర్శి ముదునూరు వీరభద్రయ్యగారు.

1930 (డిటో)

1931 అధ్యక్షుడు ముదునూరు వీరభద్రయ్యగారు. కార్యదర్శి ఉరగా లక్ష్మీనరసింహరావుగారు.

1933 అధ్యక్షుడు శీలం జగన్నాధరావు నాయుడుగారు, కార్యదర్శి ఉరగా లక్ష్మీనరసింహరావుగారు.

1933 టు 1935 (డిటో)

1936 అధ్యక్షులు వి. వి. కె. సుబ్రహ్మణ్యంగారు. కార్యదర్శి టి. లక్ష్మీనరసింహారావుగారు

1937 టు 1938 (డిటో)

1939 అధ్యక్షులు వి. వి. కె. సుబ్ర

— పక్కపేజీ చూడుడు

# మద్రాసు హైకోర్టులోని ఆంధ్ర న్యాయమూర్తులు



## వేపా రామేశం

(మద్రాసు హైకోర్టులో న్యాయమూర్తిపదవిని అలంకరించిన ఆంధ్రులలో ప్రథముడు వేపా రామేశం గారు.) 27 వ జూలై 1935 తారీఖున, పదిహేను వత్సరములు న్యాయమూర్తిగా అవిభక్త మద్రాసు హైకోర్టులో యుండి, పదవిని విరమించినారు. న్యాయవాదివృత్తి 1898 సంవత్సరములో విశాఖపట్టణంలో ప్రారంభించినారు. కొలది సంవత్సరములకే మద్రాసులో ప్రాక్టీసుచేయుట మొదలు పెట్టిరి. శక్తిసామర్థ్యాలను ప్రదర్శించి 1916 సంవత్సరమున గవర్నమెంటు ప్లీడరుగా నియమింపబడిరి. ఆపైన న్యాయమూర్తి శేషగిరిఅయ్యరుస్థానే న్యాయమూర్తిగా నియమింపబడిరి. అప్పటికి వారి వయస్సు నలుబదిఅయిదు సంవత్సరములు. న్యాయమూర్తిగా పేరు ప్రతిష్ఠలతో వ్యక్తిగత విచక్షణలేక న్యాయ నిర్వహణచేసి పేరుగాంచిరి.

హిందూధర్మశాస్త్రములోను,గణిత సంబంధ వ్యవహారములలోను, ఈనాములు, ఎస్టేటులాందు చట్టము నవి సంబంధించిన వ్యాజ్యములలోను అసమాన నిపుణులని పేరు గాంచిరి గణిత శాస్త్రములో వీరికియున్న విజ్ఞానము, న్యాయ నిర్వహణలో ఎక్కువగా తోడ్పడినది. న్యాయవాదులను సదయ భావముతో, వారి సహకారముతో పేరు ప్రఖ్యాతులనుగణించిరి. జ్యోతిష శాస్త్రంలో చక్కని అభిరుచి, ప్రజ్ఞ ఉన్నవారు.



## యం. వెంకటసుబ్బారావు

### 1921-1938

డర్ సి. వి. కుమారస్వామిశాస్త్రి గారివద్ద ఎప్రెంటిసుగానుండి వి. రాధాకృష్ణయ్యగారితోచేరి ప్రాక్టీసు అరంభించారు

మద్రాసు ఒరిజనల్ సైడు ప్రాక్టీసు చేయుచూ. హైకోర్టు న్యాయమూర్తి అయిన ప్రసన్నవ్యక్తి. చిన్నవయస్సు వంటి నలబదియ మూడవఏట న్యాయమూర్తిగా [illegible] ప్రతిరి, అద్భుత

చూపిన పరిశీలనా శక్తి, ధైర్యము, స్వతంత్ర దృక్పథము, రిటైరు అయిన 1938 సంవత్సరము వరకు కనుపించుచుండెను న్యాయసూత్రములను పరిశీలించి, వ్యాఖ్య చేయుటలోను వాటిని అవగాహన చేసుకొని, న్యాయదృష్ట్యా అన్వయింప జేయుటలోనూ, అసమానులనిపించుకొనిరి న్యాయ సంబంధ నలకు జీవముపోసి 'హిందూ ధర్మశాస్త్రము'ను నూత్న సాంఘిక పరిస్థితులకు అన్వయింపజేసిరి. కాలపరిమితి దృష్ట్యావ్యాజ్యములను తీర్మానించిన, న్యాయము మాటుపడునని వారి నమ్మకము. అదినుంచి తుదివరకు సాధక బాధకములను స్థూలంగా పరిశీలించిన గాని వారు తృప్తిపడువారు కారు. ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత, వారి అభిప్రాయాన్ని మార్చుట దుర్లభము. దేశాభిమానం, వ్యక్తిగత గౌరవం, నిలబెట్టుటలో అసమానులు, యింగ్లీషు న్యాయమూర్తులతో కొన్ని సమయాల్లో, వికేభవించక, వారి వ్యక్తి గౌరవాన్ని కాపాడుకొనిరి. సహృదయులు ధార్మికులు మానవసేవ అంటే అమిత ప్రీతి. వీరు, వీరి సతీమణి మద్రాసు సేవాసదనమునకు చేయుచున్న సేవ అసమానము. చిన్న వయస్సులో న్యాయమూర్తిగా నియమింపబడి, 17 సంవత్సరములు న్యాయమూర్తిగా యుండిన వ్యక్తి శ్రీ సుబ్బారావుగారు.



## పి వెంకటరమణరావు

### 1936—1942

వీరు ఆరు సంవత్సరములు న్యాయమూర్తి పదవిని అలంకరించిరి. హిందూ ధర్మశాస్త్రములోనూ, భూకాపులు విధానములలోనూ, కంపెనీలా లోనూ, వాణిజ్యశాస్త్రములోనూ, అన్ని తరగతుల న్యాయశాస్త్రములలోను, అద్వితీయు లనిపించుకొనిరి. ఈ ఆరు సంవత్సరములలో, వీరు యిచ్చిన తీర్పులను ఆమూలాగ్రంగా, ప్రతి న్యాయవాది చదివి తీరవలసినది. తిరువాన్కూరు నేషనల్ బ్యాంకు లిక్విడేషనులో వీరు చూపిన న్యాయ, ధర్మశాస్త్ర, సూత్ర పరిశోధన అద్వితీయము. ఏ యున్నత పదవి, వీరు అలంకరించినా, తాను న్యాయవాదినని మరువలేదు. నిగర్వి సాంఘికజీవి. దైవభక్తులు. అదృష్టవంతులు. వీరు మైసూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి చేసిరి. వీరి ఏకైకపుత్రుడు మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పాకాల వెంకట రాజమన్నారుగారు. వీరి అల్లుడే. శ్రీ కోకా వెంకటసుబ్బారావుగారు. ఏక ఆంధ్రరాష్ట్రహైకోర్టు ప్రథమ ప్రధాన న్యాయమూర్తి వీరిద్దరని, న్యాయశాస్త్రములో ప్రవేశించిన ఉన్నత శ్రేణికి చేరునట్లు కృషిచేసిన ఆదర్శజీవి వెంకటరమణారావుగారు మంచి మేధావి గ్రంథ పఠనే వీరి దినచర్య.



రచన

శ్రీ కామరాజు కృష్ణమూర్తిగారు

## బి. సోమయ్య

### 1939-1946

వీరు సునిశితమనస్కులు. అసమాన ప్రజ్ఞతో వ్యవహరించిరి ఎంతటిక్లిష్టమయిన వ్యవహార పేచీని అయినా మూలసూత్రాన్ని గ్రహించి తీర్మానించేవారు తర్కమూలనే గాక అసలు దస్తావేజులు చదివి, న్యాయాన్వేషణచేసేవారు. క్రూరంగా ప్రవర్తించే భర్తలు పితృద్రోహులు, తండ్రిని ధిక్కరించే పుత్రులు, ఋణగ్రస్తులను వేధించే ఋణదాతలు, కౌలుదారుని తిప్పలుపెట్టే భూస్వాములు, వీరికోర్టులో గడగడలాడేవారు. అన్యాయాన్ని అరికట్టటానికి వీరుచేసేకృషి అపారం. జూనియర్ న్యాయవాదులంటే వీరికి ఔదార్యం. సీనియరు యితరకోర్టులో వున్నారని వాయిదా కోరుతే, జూనియరునే, అప్పీలు నడిపించమనేవారు. అప్పీలులో పాయింటులేదని వారు తలుస్తే, సీనియరు, వచ్చేవరకు వాయిదా వేసేవారు. వీరు అతి ధార్మికులు కర్ణదాత. అతి జాగ్రత్తగా విధి నెరవేర్చేవారు. న్యాయమూర్తులూ న్యాయవాదులు వికేభవించినగాని, న్యాయం, నిర్ణయంకాదని వీరి అభిప్రాయం.

1911 వ సంవత్సరంలో ప్రాక్టీసు మొదలుపెట్టి త్వరలోనే న్యాయమూర్తుల మన్ననలను సంపాదించిరి ప్రస్తుతం వీరు సుప్రీంకోర్టులో ప్రాక్టీసు చేయుచున్నారు.

హోమియోపతి వైద్యంలో వీరికి నమ్మకం ఎక్కువ. దాని ప్రాపకానికి ఎంతో కృషిచేస్తున్నారు.

## గోవిందరాజాచారి

### 1946-1948

ఉన్నతశ్రేణిలో లాకాలేజినుంచి 1921 లో ప్యాసుఅయి శ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యరువద్ద ఎప్రెంటిస్సు చేసి, ప్రాక్టీసు పెట్టారు. అతి త్వరలోనే, అగ్రస్థానం ఆక్రమించారు. ఆయన వాక్‌చాతుర్యం, సూటి వాదన, యింగ్లీషుభాషయందు ప్రవీణత, అసామాన్యం. ఈగుణాలే, న్యాయమూర్తులదృష్టిని ఆకర్షించింది. వీరి న్యాయశాస్త్రనిరూపణ ప్రేక్షకులను చకితులజేసి, ఆకర్షించేది. ఉన్నత న్యాయవాది, ప్రసిద్ధ న్యాయమూర్తి అని పేరు గాంచిరి. వీరిగుణగణాలను విమర్శించటం, స్తుతిస్తరణ శీతిచేత ఆపవలసి వస్తుంది. జూనియరు న్యాయవాదులకు వీరు చూపిన సానుభూతి ప్రశంసనీయం ఎప్పుడు చిరునగవులో, మృదుమధురమయిన నడవడికలో ఆకర్షించేవారు. మాటలలో సౌంపు, వారి

సామ్యం. వారు నాగురుతుల్యులు కొద్దికాలమే న్యాయమూర్తిగా యున్నా, వారి తీర్పులను పరిశీలించిన వారికి, వాటి ఔన్నత్యం తెలుస్తుంది వీరికి సాంఘిక, వాఙ్మయ, చిత్రకళలందు అభిరుచి ఎక్కువ. వీరి ఆకాలమరణం ఆంధ్రకు తీరనిలోటు.

## యాహ్యా లీ

### 1945-49

నెల్లూరు, మధ్యతరగతి ముస్లిము కుటుంబములో 1893 ఆగస్టులో జన్మించిరి. 1918 వ సంవత్సరములో లాకాలేజినుంచి ప్యాసయి, ప్రాక్టీసు నెల్లూరులోనే పెట్టిరి. అచ్చటనే గవర్నమెంటు ప్లీడరుపదవిని అలంకరించిరి. 1926 వ సంవత్సరములో జిల్లా జడ్జిగా నియమింపబడిరి. తరువాత యినక౦టాక్సు ఎప్పెలెట్టు ట్రిబ్యునల్ సభ్యునిగా నియమించిరి. 1945,లో మద్రాసు హైకోర్టు న్యాయమూర్తిగా నియమింపబడిరి.

వీరి ధరోక్తులు, గౌరవ, మర్యాదలు న్యాయవాదులను ఆకర్షించేవి. న్యాయ నిర్వహణయందు,ఎరుగు,దిగుడులు లేక వ్యక్తి విచక్షణ లేక, నిర్వర్తించేవారు. స్నేహపాత్రులు.



## పి. సత్యనారాయణరావు

### 1947-1954

జూలై మూడవ తారీఖున వీరు పింఛను పుచ్చుకొందురు. జూలై 5 వ తారీఖున ఆంధ్రకు ప్రత్యేక హైకోర్టు స్థాపిస్తారు. వీరు చండ ప్రచండులు. అన్యాయము సహించరు. పట్టుదల ఎక్కువ పట్టుదలవల్లనే దేహదౌర్బల్యమును లెంకతీసిరి. వాదనలందును అతి శ్రద్ధతో, పట్టుదలతో వాదించేవారు. న్యాయశాస్త్రము కరతలామలకం. ఘనంగా, కేసు చదివితే గాని, వీరిదగ్గర వాదించుట కష్టం. న్యాయాన్వేషణచురుకుగా, త్వరితతో జరిగేది. ఏ సంధానం చెందిన, న్యాయశాస్త్రమయినా, వీరికి ఆమూలాగ్రంగా తెలుసు. వీరి తీర్పులు ప్రకటించలు బడనివి. విహంకేమైనా లోటుపోయి, ఆరాతీసేవరకు తృప్తిచెందే వారుకారు. పయిపయిన వాదనచేయు న్యాయవాదులకు, వీరిదగ్గర భీతిగా వుండేది వీరి అనుభవం, ఆంధ్ర హైకోర్టుకు లభించకపోవటం, మన దురదృష్టం అనాలి. కోర్టులో మార్తాండునివలెయున్నా, మెత్తటి హృదయం. కోపంవచ్చినా,అప్పుడే చల్లబడేవారు. బమ్మెర పోతనామాత్యుని పద్యాలు కంఠస్థంగా వచ్చు. హోమియోపతియందు నమ్మకం ఎక్కువ స్వయంగా కొన్ని కేసులను నయంచెశారు స్నేహపాత్రులు విద్యాసంస్థలందు అభిమానం. వీరి అనుభవాన్ని, ఆంధ్ర యూప యోగించుకోగలదని నా ఆశయం.

మద్రాసు హైకోర్టులో పెరుప్రతి

—పక్కపేజీ చూడుడు



అనంతపురం న్యాయవాదుల సంఘ అధ్యక్షుడు టి. చిదంబరయ్యగారు.



కడప న్యాయవాదుల సంఘ అధ్యక్షుడు వి. రాధాకృష్ణయ్యగారు.



కడప న్యాయవాదుల సంఘ కార్యదర్శి ఎస్. నాగరాజశాస్త్రిగారు.



చిత్తూరు న్యాయవాదులసంఘ అధ్యక్షుడు కె. వరదాచారిగారు



చిత్తూరు న్యాయవాదులసంఘ కార్యదర్శి కె. సుబ్బరామయ్యగారు



గుంటూరు న్యాయవాదుల సంఘ అధ్యక్షుడు సి. హనుమంతరావుగారు



గుంటూరు సంఘ సంయుక్త కార్యదర్శి వై. అబద్ధయ్యగారు.



విశాఖపట్టణ న్యాయవాదుల సంఘ అధ్యక్షుడు వి.డి. ప్రసాదరావుగారు.



రాజమండ్రి న్యాయవాద సంఘాధ్యక్షుడు గుండపునీడి అబ్బులుచౌదరి



రాజమండ్రి న్యాయవాదులసంఘ కార్యదర్శి వి. ఎల్. శర్మగారు



శ్రీకాకుళం న్యాయవాదుల సంఘ అధ్యక్షుడు పుల్లెల విశ్వనాథంగారు



శ్రీకాకుళం న్యాయవాదుల సంఘ కార్యదర్శి పుల్లెలవెంకటరమణయ్యగారు



సంయుక్త కార్యదర్శి కె. సీతారామస్వామిగారు.



ఏలూరు న్యాయవాదులసంఘ అధ్యక్షుడు వల్లూరు వెంకట్రావుగారు.



కార్యదర్శులలో ఒకరైన బొరుసూచి విశ్వనాథరావుగారు.



కార్యదర్శులలో ఒకరైన మోచర్ల వెంకట్రావుగారు



గుడివాడ న్యాయవాదుల సంఘ అధ్యక్షుడు అట్లూరి ధర్మారావుగారు.



గుడివాడ న్యాయవాదులసంఘ కార్యదర్శి దాడనిడి రామమోహనరావుగారు.



గుంటూరు జిల్లాకోర్టు పబ్లిక్ ప్రాసిక్యూటర్ జి. వి. రాఘవయ్యగారు



గుంటూరుజిల్లా ప్రభుత్వప్లీడర్ టి. రంగారెడ్డిగారు



మాడభూషి వేదాంతం నరసింహాచార్యులుగారు (గుంటూరు).



నెల్లూరు న్యాయవాది చివుకుల మాలకొండయ్యగారు



గుంటూరు జిల్లాజడ్జి వేమూరి సత్యనారాయణరావుగారు



ఆంధ్రప్రభుత్వహోమ్‌శాఖ సంయుక్త కార్యదర్శి ఓ.పి. నరసింహంగారు.

# న్యాయవాద సంఘాలు

... స్వామ్యంగారు, కార్యదర్శి కె. వి. సుబ్బారావు చౌదరిగారు.

1940 అధ్యక్షులు కె. వి. రమణయ్య నాయుడుగారు. కార్యదర్శి కె. వి. సుబ్బారావు చౌదరిగారు.

1941 టు 1943 (డిటో)

1944 టు 1948 అధ్యక్షులు కె వి. రమణయ్యనాయుడుగారు, కార్యదర్శి వి. యు భీమరాజుగారు.

1948-49 అధ్యక్షులు కె. వి. రమణయ్య నాయుడుగారు, కార్యదర్శి యడవల్లి వెంకటప్పయ్యగారు.

1950-54 అధ్యక్షులు తాడంకి వెంకట కృష్ణారావుగారు, కార్యదర్శి మరగా వెంకబరావుగారు.

1954-55 అధ్యక్షులు పి. లింగయ్య చౌదరిగారు. కార్యదర్శి కొమరవోలు వెంకటసుబ్బారావుగారు.

ప్రస్తుత అధ్యక్ష, కార్యదర్శులు తమఫోటోలను సప్లయి చేయలేదు.

## ఏలూరు

ప్రజాహిత జీవితానికి నాయకత్వం వహించడంలో నేమి, న్యాయవాద వృత్తిలో మహోన్నతు లనదగినవారి సంఖ్యాబలంలో నేమి, ఏలూరు న్యాయవాదుల సంఘం మొదటినుండీ ఆంధ్రరాష్ట్రంలో అద్వితీయస్థానం అలంకరించిందనడంలో అతిశయోక్తి లేదు.

మొదట్లో అనగా 1895 కు పూర్వం (ప్రస్తుతం పశ్చిమగోదావరిజిల్లా అప్పటి 'గోదావరి' జిల్లాలో అంతర్భాగంగా ఉండేది. అప్పుడు ఏలూర్లో సబ్‌కోర్టు ఉండేది. అప్పటికి ఏలూరు 'బార్' సంఖ్య తక్కువైనా, ఈ ప్రాంతంలో చాలా పేరుప్రతిష్ఠలు గడించుకొంది. కీ॥ శే॥ లు శ్రీ ఘంట్యసూరి శ్రీరామరాజు, శ్రీ పిల్లలమర్రి ..., శ్రీ అవధానుల దక్షిణామూర్తి మొదలైన ప్రముఖ న్యాయవాదులు అప్పటి 'బార్'లో పేరెన్నికగన్నారు. 1895 లో ఈ జిల్లాప్రాంతం 'గోదావరి' జిల్లానుండి విడదీసి కృష్ణాజిల్లాలో కలిపారు. దానితో యిక్కడి సబ్‌కోర్టు ఎత్తివేయబడింది. దాన్ని కేసుల సంఖ్య ఎక్కువవడంవల్ల తిరిగి 1905 లో సబ్‌కోర్టు స్థాపించబడింది. తరువాత, 2వ, 3వ సబ్‌కోర్టులు కూడా స్థాపించవలసినంత అధికంగా పని పెరిగింది. అప్పటినుండే ఏలూరు 'బార్' బాగా అభివృద్ధి చెందింది. పరిసర జిల్లాలలో కూడా ఎక్కువగా పేరుగాంచింది. అప్పటికే ఏలూరు న్యాయవాదులసంఘ సభ్యుల సంఖ్య 100 వరకూ పెరిగింది. అప్పటి బిడ్డలలో పేరొందినవారు, శ్రీ సోమంచి భీమశంకరం, శ్రీ ... సాంబశివరావు, శ్రీ ... శ్రీ ... దాసు శ్రీరాములు ...

ప్రజాహిత సేవలలో యీ బార్ లో కనబడా, రాష్ట్రమంతట లోనూ, జాతీయరంగంలోనూ, ఏలూరు బార్ నాయకత్వం వహించింది. యావద్భారతదేశం ఖ్యాతిగడించిన మహా విజ్ఞులలో ఒకరని పేరొందిన సర్ మోచర్ల రామచంద్రరావు, ప్రథమ ఆంధ్ర గవర్నరుగా మద్రాసు రాష్ట్రం పరిపాలించిన సర్ కె. వి. రెడ్డినాయుడూ ఏలూరుబార్ సభ్యులే. ఏలూరు పురపాలక సంఘం ఏర్పడినది మొదలు, యిటీవలవరకూ, ఏలూరుపట్టణాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేసి, అన్ని సౌకర్యాలు సమకూర్చిన నైపుణ్యులందరూ ఏలూరు 'బార్' సభ్యులే. సర్ మోచర్ల రామచంద్రరావు, సోమంచి భీమశంకరం, ములుకుట్ల సూర్యప్రకాశరావు, వల్లూరి రామారావు, బడేటి వెంకట్రామయ్య నాయుడు మొదలైనవారు వరసగా పురపాలక సంఘాధ్యక్షపదవి నలంకరించినవారు. జిల్లాపరిపాలన కూడా చాలా సంవత్సరాలు ఏలూరు 'బార్' ఆధిపత్యంలో నే ఉండేది. జిల్లాబహుముఖాభివృద్ధికి కారకులైన శ్రీ పెన్మెత్స పెద్దిరాజు, శ్రీ బడేటి వెంకట్రామయ్యనాయుడు, శ్రీ దండు నారాయణరాజు గార్లు ఏలూరు 'బార్' సభ్యులే. వీరందరూ జిల్లాబోర్డు అధ్యక్షులు గానే గాక, జిల్లాలో గొప్ప నాయకులుగా ప్రఖ్యాతి గాంచారు. శ్రీ సోమంచి శేషగిరయ్యగారు ఏలూరు తాలూకాబోర్డు అధ్యక్షులుగా అగణితసేవ చేశారు.

ఆ రోజుల్లో యావదాంధ్రదృష్టి నాకర్షించిన "శ్రీ నాగుని వీధినాటకం కేసు" విచారణ ఏలూర్లో నే విచారింపబడింది.

1925 లో యీ జిల్లా ప్రాంతం తిరిగి కృష్ణాజిల్లానుంచి విడదీయబడి, పశ్చిమ గోదావరి జిల్లాగా ఏర్పర్చబడింది. దాంతో ఏలూర్లో జిల్లాకోర్టు దాని అనుబంధంగా యితరకోర్టులు ఏర్పర్చబడినవి. ఏలూరు బార్ మరింత అభివృద్ధి చెందింది. యీ జిల్లాను మొట్టమొదటగా శ్రీ చదలవాడ చక్రధరరావుగారు జిల్లా పబ్లిక్ ప్రాసిక్యూటర్ గవర్నమెంటు ప్లీడరు గాను యిద్దరుగా చాలకాలం పనిచేశారు. అంతే కాక ఏలూరు బార్ నాయకులుగా ప్రముఖ న్యాయవాదిగా చాలా సంవత్సరాలు పనిచేసి, ఈ మధ్యనే వృత్తి నుండి విరమించారు.

ప్రస్తుతం ఏలూరు బార్ లో 120 మంది సభ్యులున్నారు. శ్రీ వల్లూరి వెంకట్రావుగారు ప్రస్తుతం ఏలూరు న్యాయవాదుల సంఘం అధ్యక్షులు. యువకులూ ఉత్సాహవంతులూ అయిన శ్రీ బొరుసూచి విశ్వనాథరావు, శ్రీ మోచర్ల వెంకట్రావుగార్లు కార్యదర్శులు.

శ్రీ జంధ్యాల లక్ష్మీనృసింహంగారు పబ్లిక్ ప్రాసిక్యూటరు గాను, శ్రీ చిట్టూరి యిం. ద్రయ్యగారు గవర్నమెంటు ప్లీడరుగాను పనిచేస్తున్నారు.

శ్రీయుతులు మోచర్ల వియ్యన్న పంతులు, శ్రీ వల్లూరి వెంకటసుబ్బారావు, శ్రీ వారణాసి పద్మనాభం, శ్రీ సందూరి వెంకటసుబ్బారావు శ్రీ గుంటూరు వీరరాఘవులు, శ్రీ రావిపాటి వీరరామారావు, శ్రీ సోమంచి లింగయ్య, శ్రీ ఘార్షి శ్రీనివాసరావు, శ్రీ పంద్రంగి రాజేశ్వరరావు, శ్రీ ఎస్. కె వి. కృష్ణావతారం, శ్రీ టి. రాజగోపాలరావు, శ్రీ కుప్పా రామారావు, మొదలైనవారు నేటి బార్ ప్రముఖులలో కొందరు. శ్రీ బుద్ధిరాజు శివబ్రహ్మంగారు ఏలూరు బార్ లో వయస్సులో నేమి, వారి వృత్తిలో నేమి వృద్ధులైనా యిప్పటికీ న్యాయవాదులుగా పనిచేస్తూనే ఉన్నారు. వీరు 1903 లో న్యాయవాదవృత్తిని స్వీకరించి, యిప్పటికి 51 సంవత్సరాలు న్యాయవాదులుగా పనిచేశారు.

ఏలూరు బార్ చాలాకాలం కోర్టు భవనంలో నే ఉంటూండేది. 1938 లో స్వంతభవనం నిర్మించుకొని, ప్రస్తుతం అందులో ఉంటూంది.

## రాజమండ్రి

బ్రిటిషుప్రభుత్వంవారు మన రాష్ట్రపు న్యాయశాఖలో ముందుగా ఏర్పాటు చేసినజిల్లా కోర్టులలో 'గోదావరి జిల్లా కోర్టు' ఒకటి! గోదావరి జిల్లాకోర్టు రాజమహేంద్రవరములో ఏర్పడిననాటి నుంచీ ఇచ్చట న్యాయవాద వర్గములో చాలమంది ఉత్తమ తరగతి మేధావంతులైన న్యాయవాదు లుండేవారు.

ఇక్కడ 1895 సం.రం.లో కీ॥ శే॥ ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుగారి అధ్యక్షతను న్యాయవాదులంతా సమావేశమై తమకొక సంఘమును ఏర్పాటుచేసుకున్నారు. కీ॥ శే॥ శ్రీ ఎ. సుందరరామయ్య స్థాపక కార్యదర్శి (దివాన్ బహదూరు) కీ॥ శే॥ చిత్రపు వెంకటచలం పంతులు, కీ॥ శే॥ మాడిరెడ్డి వెంకటరత్నం నాయుడు (దివాన్ బహద్దూరు) (ఆంధ్రప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు గారి మాతామహులు) ఆ స్థాపక సంఘ కార్యవర్గ సభ్యులు. ప్రారంభంనాడు సభ్యులు 14 మాత్రమే! 1895 సం.లో శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు (ఆంధ్ర ముఖ్య మంత్రి) కీ॥ శే॥ సర్ మోచర్ల రామచంద్రరావు పంతులు, శ్రీ నిడమర్తి జలదుర్గాప్రసాదరాయుడు, శ్రీ వేలూరి వెంకట్రామయ్య, శ్రీ ములుకుట్ల అచ్యుతరామయ్య, శ్రీ అ. కనకరాజు, శ్రీ నేతి సోమయాజులు మొదలువారు సభ్యులైనారు. 1900 సం. తర్వాత సుప్రసిద్ధులైన కీ॥ శే॥ సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడు, కీ॥ శే॥ శ్రీ గంటి లక్ష్మన్న మొదలయిన వారు సభ్యులైనా రుండేవారు. కీ॥ శే॥ నిం ఘంటల లక్ష్మీనరసింహమూర్తి, యస్. శ్యామలరావు, వి. అచ్యుతలింగం, సోమిన కామేశ్వరరావుగార్ల సంఘ సభ్యులలో యీ మధ్యకాలంలో ప్రముఖ న్యాయవాదులుగా వుండేవారు. యీ సంఘసభ్యులలో ప్రముఖులుగా వుంటూ వుండిన కీ॥ శే॥ కందుల వీరరాఘవస్వామి నాయుడు గారిల్లా, కీ॥ శే॥ దేవత శ్రీరామమూర్తి గార్లు మద్రాసు శాసన సభలకు జిల్లా ప్రతినిధులుగా ఎన్నుకోబడ్డారు.

మన ఆంధ్రప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావుగారి తండ్రిగారు కీ॥ శే॥ కోకా సుబ్రహ్మణ్యేశ్వరరావు నాయుడు గారీ సంఘములో సభ్యులుగా వుండేవారు (సత్యవాది అని వారి కంతో గౌరవముండేది) ఈ న్యాయవాద సంఘము 1860 సం॥పు 21 చట్ట నిబంధనల ప్రకారం 1928 లో రిజిస్టరు చేయబడినది. అంత వరకూ యీ సంఘమునకు కార్యకర్తగా కార్యదర్శియే వ్యవహరించెడి వారు. రిజిస్ట్రేషను మొదలు 6 సం. కాలము కీ. శే చిత్రపు వెంకటచలం పంతులుగారు అధ్యక్షులుగా వున్నారు. ప్రస్తుతాధ్యక్షులు శ్రీ గుండపునీడి అబ్బులుచౌదరీ శ్రీ ఎ. రామారావు, కీ శే. వి. ఎల్ ఎన్. మూర్తి ఆనాటి కార్యవర్గసభ్యులు. శ్రీ ఎ. రామారావు గారొక పదిసం॥లూ, కీ. శే శ్రీ సోమిన కామేశ్వరరావు గారొక తొమ్మిది సం॥లూ అధ్యక్షులుగా వున్నారు.

ఈ న్యాయవాద సంఘానికి ప్రథమం నుంచి నాయకులుగా వుంటూవచ్చిన కీ॥ శే॥ చిత్రపు వెంకటచలం పంతులు గారు మద్రాసు బార్ కౌన్సిలు సభ్యులుగా ఎన్నికైనారు. రాజధానీ నగరంలో కాక యితరచోట్ల ప్రాక్టీసుచేసే న్యాయవాది బార్ కౌన్సిలుకు ఎన్నికైనది బార్ కవున్సిలు చరిత్రలో వెల్ల వారిఎన్నిక ఒక్కటే!

ప్రస్తుతాధ్యక్షులు శ్రీ గుండపునీడి అబ్బులుచౌదరీగారు క్రిందటి సం॥లో ఈ సంఘాధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. శ్రీ చౌదరీ 30 సం॥గా న్యాయవాదిగా వుంటూ-జిల్లాబోర్డులో 4 సం. సభ్యులు గావున్నారు. 1947 సం. నుంచి గవర్నమెంటు ప్లీడరుగా వుంటున్నారు.

ప్రస్తుత కార్యదర్శి శ్రీ వేలమూరి నరసింహేశ్వరశర్మగారు, జిల్లాజడ్జిగా వుంటూ స్వర్గస్థులైన వేలమూరి సుబ్బారావుగారి కుమారులు యువకులు ఉత్సాహవంతులు.

1945 సం. డిశెంబరు 16 తేదీని ఈ సంఘ స్వర్ణోత్సవములు శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి అధ్యక్షతను జరుపబడినవి.

యీ సంఘ ప్రముఖులు పలువురు రాజమండ్రినగర సంఘాధ్యక్షులు గానూ, జిల్లాబోర్డు అధ్యక్షులుగానూ, సమర్థులైన పరిపాలకులుగా ప్రసిద్ధి గడించారు.

## కాకినాడ

గోదావరిజిల్లా మొత్తం పరిచురల క్రింద విభజన కాకపూర్వం (1907 కు పూర్వం) రాజమండ్రిలో జిల్లా కోర్టు, కాకినాడలో ఒక సబుకోర్టు, ఏలూరులో మరొక సబుకోర్టు మాత్రముండెను.

కీ॥ శే॥ గంజాం వెంకటరత్నం పంతులు, కృత్తివెంటి పేర్రాజు, సోమినీ వెంకయ్య, బులుసు వెంకట్రావుగారు అప్పటి న్యాయవాదులలో అగ్రగణ్యులు. దు॥ బ॥ దురుశేటి శేషగిరిరావుపంతులుగారు కాకినాడలో మొదట బి. యల్. గా న్యాయవాది వృత్తిలో ప్రవేశించిరి.

కాకినాడ బార్ అసోసియేషన్ 1899 లో స్థాపించబడెను. ప్రథమ కార్యదర్శిగా ముళ్ళపూడి శోభనాద్రిరావుగారు పనిచేసియుండిరి. తరువాత వరుసగా కె. కళ్యాణస్వామి, దర్భా వెంకయ్య, చల్లా కామేశ్వరరావు, మాంధాత వెంకట్రావు, వేములకొండ రామారావు గార్లు కార్యదర్శులుగా నుండిరి. 12 సంవత్సరములనుంచి శ్రీ కిళాంబి రాఘవాచార్యులు గారు కార్యదర్శిగా పనిచేయుచున్నారు. కాకినాడ బార్ అసోసియేషనుకు అధ్యక్షుడు లేడు.

గత 30 సంవత్సరములలో బారులో గణుతి కెక్కినవారు కీ. శే పుష్యలూరి భీమశంకరశాస్త్రి కీ. శే. ములుకుట్ల అచ్యుతరామయ్య, కీ శే. చల్లా పేరయ్యశాస్త్రి, కీ. శే. యల్లాప్రగడ కామేశ్వరరావు, కీ. శే వంగూరి సూర్యప్రకాశరావు గారు శ్రీ బులుసు సాంబమూర్తి, చావలి రామసోమయాజులు, లక్కరాజు సుబ్బారావు, వంపటి రామబ్రహ్మం, దుర్వూరి కృష్ణమూర్తి, డి. వి. యస్. రాస్ గార్లు.

కీ. శే. శ్రీ కృత్తివెంటి పేర్రాజు గారు, కీ. శే. బులుసు వెంకట్రావుగారి గ్రంథాలయమునుకొని కాకినాడ బార్ అసోసియేషనుకు బహూకరించిరి. ఆంధ్రదేశంలో ఇంత విలువయినమంచి గ్రంథాలయము మరెచటను లభించదు. కోర్టులు హెచ్చినకొలది కాకినాడ కోర్టు జూరిస్‌డిక్షను తగ్గినది. కాకినాడ బారులో 122 మంది సభ్యులుకలరు. కాకినాడ బారుసభ్యులలో గంజాం వెంకటరత్నం పంతులు, కృత్తివెంటి పేర్రాజు, దు॥బ॥దురుశేటి శేషగిరిరావు పంతులు, చావలి రామసోమయాజులు గార్లు శాసనసభ్యులుగా ప్రజలతరఫున ప్రాతినిధ్యము వహించియుండెరి. దు॥ బ॥ శేషగిరిరావు పంతులుగారు తూ॥ గోదావరి జిల్లాబోర్డుకు మొదటి నాన్ అఫిషియల్ ప్రెసిడెంటుగా కార్యభారము వహించియుండిరి. ఫస్టుక్లాసు బెంచికి వీరే ప్రథమ అధ్యక్షులు. శ్రీ లక్కరాజు సుబ్బారావుగారు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగాను, ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆక్టింగ్ వైస్ ఛాన్సలరుగాను కాకినాడ బారుకు పేరుతెచ్చిరి. కాకినాడ బారులోనుంచి మ్యునిసిపలు చైరుమన్లుగా శ్రీ దురుశేటి శేషగిరిరావు పంతులు, దామోదర కృష్ణమూర్తి, లక్కరాజు సుబ్బారావుగార్లు నగరాభివృద్ధికి తోడ్పడిరి. కీ॥ శే॥ పరిమి బ్రహ్మాజీనాయుడుగారు క్రిమినలు వకీలుగా ఖ్యాతిగడించిరి. శ్రీ జమ్మలమడక భాస్కరరామమూర్తి, యల్లాజోస్యుల వెంకటేశ్వర్లుగార్లు క్రిమినలు సైడుని పేరు సంపాదించిరి కాకినాడబారులో ఒకేబాల్, ఎట్‌లా, కీ. శే శ్రీకాకుళపు శేషగిరిరావుగారుండెడివారు. వీరు కాకినాడ బాంబుకేసులలో ముద్దాయిల తరపున ప్రథమ వకీలుగా, వాదించిరి. మ్యునిసిపలు, జిల్లాబోర్డుల వకీలుగా కూడ వీరు పనిచేసియుండిరి.

శ్రీ దు॥ బ॥ డి శేషగిరిరావు పంతులు గారు చాలకాలం ఎం. ఎస్. ఎన్ చారిటీస్ ట్రస్టీగా యుండిరి. వారి అనంతరం శ్రీ లక్కరాజు సుబ్బారావుగారు ఛారిటీస్ అభివృద్ధి పంచి ఒక హైస్కూలు కూడ స్థాపించ గలిగిరి, త్వరలోనే కాలేజీ క్రింద చేయు యత్నములు చేయుచున్నారు.

పురాతన కాలపువకీళ్ళు శ్రీదిసుమర్తి కేశవరామస్వామి, రామస్వామి అనువారుండెడివారు. వారి పేర దిసుమర్తి నారి వీధి అని కాకినాడలో నొకవీధి యిప్పటికిని కలదు.

గాంధిగారి పిలుపు విని 1919-20 సం॥ సహాయ నిరాకరణోద్యమంలో న్యాయవాద వృత్తిని విసర్జించి శ్రీ బులుసు సాంబమూర్తిగారు మహత్తరమైన త్యాగ మొనర్చిరి వీరితో బాటు శ్రీ కుందుర్తి కామోజీరావు, శ్రీ గంటి సుబ్బారాయుడు గార్లు కూడ న్యాయవాదవృత్తిని వదలుకొని దేశసేవకు కడంగిరి. శ్రీ సాంబమూర్తిగారి కృషివలననే కాకినాడలో 38వ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ మహాసభ జరిగింది. బారు సభ్యులందరు అవిరళకృషితో సభ లు జయప్రదముచేసిరి.

శ్రీ ఎం. వి. వి. కె. రంగాచారిగారు అనేక అంతర్జాతీయ సంస్థలలోనూ దలిండియా ఫిలసాఫికల్ కాంగ్రెస్ విమర్శక అధ్యక్షులుగానూ తత్త్వవిషయిక గ్రంథ ప్రచురణల ద్వారా ఇంగ్లాండు, అమెరికాయున్నకు దేశములలో ప్రచారముచేయుచూ భారతీయ సంస్కృతికి సేవచేయుచున్నారు.

## విశాఖపట్నం

ఆంధ్రదేశ మంతటిలోనూ ప్రప్రథమమున విశాఖ పట్టణములో నే న్యాయవాదుల సంఘము యేర్పడినదని చెప్పవచ్చును.

సంఘము వజ్రోత్సవం 1940 వ సంవత్సరములో ప్రముఖ న్యాయవాది శ్రీ యస్. శ్రీనివాసఅయ్యంగారి అధ్యక్షతన జరిగింది. 1950 వ సంవత్సరములో డెబ్బయిసంవత్సరముల ఉత్సవము మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పాకాల రాజమన్నారు గారి అధ్యక్షతన జరిగింది.

పంధొమ్మిదవ శతాబ్ది ప్రారంభము లో లార్డు కారన్ వాలిస్ మద్రాసు రాజధానిలో బ్రిటిషు న్యాయపరిపాలనా విధానము ప్రవేశపెట్టినప్పటి నుంచీ ఆ పరిపాలనా విధాన మే ఇప్పటి వరకూ అమలులో వుంది.

వాస్తవానికి 1742 వ సంవత్సరము లో విశాఖపట్టణమూ, పరిసరాలూ ఇంగ్లీషు సెటిల్‌మెంటుపాలన క్రింద వున్నప్పటికీ విశాఖ పట్టణములో ప్రప్రథమమున బ్రిటిషు న్యాయ పరిపాలనా విధానముల మీదనే ఒక న్యాయస్థానము యేర్పాటు అయింది. అంతకు పూర్వం "హైదరాబాదు న్యాయ పరిపాలనా విధానము - చిక్కాకోల్" నవాబు క్రింద "చిక్కాకోల్" లో ఒక అదాలత్ వుండేది. యీ అదాలత్ అధిపతిని "అమీల్ దార్" అనేవారు. "చిక్కాకోల్" ఫౌజుదారే "అదాలత్" కోర్టుకు అధిపత్యము వహించేవాడు.

న్యాయ పరిపాలనా, న్యాయవాదులూ వున్నప్పటికీ న్యాయవాదులు ఒక సంఘముగా మాత్రము ఏర్పాటు చేసుకోలేదు. బ్రిటిషు పరిపాలనా విధానము అమలు జరుగుతూన్నా 1879 సంవత్సరము వరకూ ఇక్కడ న్యాయవాదుల సంఘము "బార్ ఎసోసియేషన్" ఏర్పడలేదు.

1879 వ సంవత్సరములో విశాఖపట్టణము జిల్లా జడ్జి ఏ. యల్. లిస్టరు ప్రోత్సాహమువల్లనూ కృషివల్లనూ ప్రప్రథమంగా "బార్ అసోసియేషను" రూపొందింది.

అప్పటిలో న్యాయవాది వృత్తి అవలంబిస్తూన్న 25 మంది సభ్యులుగా 1880 సం॥ము ప్రారంభములో అనువాదుల సంఘములో సభ్యులుగా చేరి పునాది వేశారు.

అయితే అప్పటిలో సెలవు మీద తమ దేశము వెళ్ళిన లిస్టరు దొరగారు తిరిగి 1882 సంవత్సరములో తిరిగివచ్చే వరకూ సంపూర్ణమయిన సంఘము యేర్పాటు అయిందని చెప్పడానికి వీలులేదు. తిరిగివచ్చి సంపూర్ణ సహకార మిచ్చారు జడ్జీ దొరగారు. ఆ సంవత్సరములో సంఘమునకు చిన్న గ్రంథాలయము విలువయిన పుస్తకములు సేకరించి యేర్పాటు చేశారు. లిస్టరుదొరగారియందు కృతజ్ఞతతో ఆ గ్రంథాలయమునకు "లిస్టరు బార్ లైబ్రెరీ" అను నామకరణము చేశారు అప్పటి న్యాయవాదులు. 1933వ సంవత్సరములో లైబ్రెరీ రిజిష్టరు అయ్యేదాకా ఆ పేరుతోనే వుండేది. లిస్టరు దొరవారు ప్రారంభ అధ్యక్షులుగానూ సభ్యులుగానూ 1912 వరకూ వుండేవారు. అప్పటిలో 30 మంది సభ్యులు వుండేవారు.

1933-వ సంవత్సరములో "బార్ అసోసియేషన్" విశాఖపట్టణము అని సంఘము రిజిష్టరు అయింది. 1924-వ సంవత్సరము వరకూ ఇక్కడికి వచ్చిన జడ్జీలూ మునసబులూ సభ్యులుగా సంఘములో వుండేవారు.

1924 నుంచి జడ్జిలూ, ఇతరతర ఆఫీసర్లూ సభ్యులుగా వుండకపోయినా, వారి సలహా సంపత్తులను మాత్రము సంఘమునకు ఇస్తూవుండేవారు.

మొట్టమొదట 1924-వ సంవత్సరములో శ్రీ భూపతిరాజు వెంకటపతి రాజుగారిని న్యాయవాదుల సంఘం అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. అప్పటి నుంచి 1940 వ సంవత్సరములో ఆనరేబుల్ జస్టిస్ ... అయ్యేదాకా వెంకటపతిరాజు గారు అధ్యక్షులుగా వుండేవారు.

1942-1943 లో శ్రీ రాజుగారు హృషీకేశ్‌కు వెళ్ళిపోవడమూ, అక్కడనే మరణించవలసింది తిరిగివచ్చి మరణించటమూ జరిగింది.

రాజుగారిస్థానే రాజుగారి కోరిక మీదనూ ఇప్పటి అధ్యక్షులు శ్రీ వి. డి. ప్రసాదరావుగారిని సంఘము అధ్యక్షునిగా ఎన్నుకుంది. గత పదకొండు సంవత్సరములనుంచి ప్రసాదరావుగారు న్యాయవాదులందరిలోనూ వృద్ధులూ అధ్యక్షులుగా వుంటున్నారు. ఇప్పటి కన్న శ్రీయుతులు బయ్యా నరసింహశర్మ, వేపా రామేశం, ఆకెళ్ళ సూర్యనారాయణరావ్, సి. వి.ఎస్. నరసింహారాజు, ప్రభల లక్ష్మీనరసింహంపంతులు, రావ్ బహద్దూర్ బలిజేపల్లి సూర్యనారాయణరావ్, వడ్డాది జగ

—పక్క పేజీ చూడుడు

## ఆంధ్ర న్యాయమూర్తులు

...స్థలు సంపాదించిన, ఆంధ్ర న్యాయమూర్తుల జీవితం సంగ్రహంగా నిరూపించాను. వీరి పదజాడలలో, ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తులు నడుచుకొనుమూ, ఆంధ్ర హైకోర్టును వున్నత పదవికి తీసుకొని వచ్చెదరని నా ఆశయం. ఆంధ్రకు ప్రత్యేకించబడిన ముగ్గురు న్యాయమూర్తులు, మద్రాసు హైకోర్టులో అగ్రస్థానాన్ని ఆక్రమించుకొన్నారు. నీరు మనకు ప్రత్యేకింపబడుట ఆంధ్రుల అదృష్టం. ఆంధ్ర రాష్ట్రం సర్వతోముఖంగా, మంగళకరంగా వర్ధిల్లాలి.



సి. రాఘవరావు

1949-1953

1919 సంవత్సరములో ప్రాక్టీసు మొదలు పెట్టి త్వరలోనే, అగ్రస్థానం వహించారు. తెమిళ, ఆంధ్ర న్యాయజ్ఞులలో వాదించుచుండిరి. దైవభక్తి, దైవచింత దైనందిన జీవితంలో మిళితమయింది. పేరెన్నిక గల న్యాయవాది. వాగ్ధోరణి వాహినిలాగ ప్రవహించేది వాఙ్మయంలోను, సాహిత్యం లోను అభిరుచి. కీరుల కాలమ్ముత్యవు పాలయిని. న్యాయమూర్తిగా యున్న కొద్ది సంవత్సరాలలోనూ. అసమానమైన పేరు గడించారు. వీరి అకాలమరణం ఆంధ్రకే పెద్దలోటు.

# ఉన్నత న్యాయస్థానాలు: మన రాజ్యాంగంలో వాటి స్థానం

(4 వ పేజీ తరువాయి)

వచ్చును. అట్లు కోరబడినవారు ఏతత్ విధులను నిర్వహించుటకు సమ్మతించిన యెడల వారికివారు ఆ విధులను నిర్వహించుచున్నంతకాలము రాష్ట్రపతి వుత్తర్వులలో సూచించిన అధికార విస్తృతి పరివేతనము కల్గియుందురు. కాని అట్టివారు ఆ హైకోర్టు న్యాయమూర్తిగా ఎంచబడరు.

## వేతనములు

ప్రతి హైకోర్టు న్యాయమూర్తికి రాజ్యాంగచట్టంలోని రెండవ షెడ్యూలులో పేర్కొనబడిన విధముగ వేతనములు యివ్వబడును. అంతేకాకుండా వారికి యివ్వవలసిన అలవెన్సులు సెలవులలో జీతము, పెన్షను మున్నగు వాటిని గురించి పార్లమెంటు చట్టం పూర్వకముగ నిర్ణయించును. అవిధముగ పార్లమెంటుచే నిర్ణయింపబడు వరకు రాజ్యాంగ చట్టములోని రెండవ షెడ్యూలులో పేర్కొనబడిన రీతిగ అలవెన్సులు, హక్కులువున్నవి. మరియు ఒక్కసారి న్యాయమూర్తిగ నియమింపబడిన తర్వాత వారు నష్టపడు విధముగా సెలవులలో జీతము, పెన్షన్ మార్చుటకు వీలుపడదు.

## న్యాయమూర్తుల బదిలీలు

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తితో సంప్రదించిన పిదప రాష్ట్రపతి ఒక హైకోర్టు న్యాయమూర్తిని ఇండియాలోని మరియొక హైకోర్టు న్యాయమూర్తిగా బదిలీచేయవచ్చును. అవిధముగ బదిలీచేయబడినవారు తదుపరి ఆ క్రొత్త ప్రదేశములో న్యాయమూర్తిగా వున్నంతకాలము పార్లమెంటు నిర్ణయించిన పరిహారవేతనము పొందు హక్కుకల్గియున్నారు. అవిధముగ పార్లమెంటు పరిహారవేతనమును నిర్ణయించువరకు రాష్ట్రపతి తన వుత్తర్వుద్వారా యీ పరిహారమును నిర్ణయింపవచ్చును.

## ప్రధాన న్యాయమూర్తి నియామకము

హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవి ఖాళీ అయినప్పుడు గాని లేక ఆ పదవిని నిర్వహించువారు ఏ కారణము వలననయిన ఆ పదవిని నిర్వహింపజాలనప్పుడు రాష్ట్రపతిచే నియమింపబడిన యితర న్యాయమూర్తులలో ఒకరు అవిధులను నిర్వహించెదరు.

## హైకోర్టుయొక్క అధికార విస్తృతి

ప్రస్తుత రాజ్యాంగచట్టం అమలులోనికి రాకపూర్వము ప్రతి హైకోర్టుయొక్క అధికార విస్తృతి, వారు అమలులో పెట్టవలసిన సూత్రములవిషయములోనేమి, న్యాయమూర్తుల అధికార విస్తృతిలోనేమి, ఆ కోర్టు తనకు కావలసిన నిబంధనలను ఏర్పాటుచేసుకొను అధికారము కల్గియుండుటలోనేమి, న్యాయమూర్తులు ఏఏకోర్టులలో ఏ విధముగ ఆసనములు గైకొనవలసినది మున్నగు విషయములు యీరాజ్యాంగచట్టంయొక్క నిబంధనలకులోబడి లేక యీ రాజ్యాంగచట్టం ననుసరించి తగిన నిబంధనలు చేయగల్గిన శాసనసభయొక్క నిబంధనల ననుసరించి యధాతధముగా వేయుండును. హైకోర్టుయొక్క అధికార విస్తృతిలో మనము గమనించవలసిన ముఖ్యమయినమార్పు ఏమనగా 1781 పార్లమెంటు యాక్టు క్రింద ఆనాటి రాజధానులలోని సుప్రీంకోర్టులకు, సాదర్ దివానీ అదాలత్ లకు, రివిన్యూకు సంబంధించినవిషయములో తీర్పు చెప్పుటకు అధికారములేదు. కాని హైకోర్టులనునిర్మాణముచేయు 1861వ చట్టంక్రింద వారికి యీ అధికారము లేనట్లు తెలుపబడియుండలేదు. తదుపరి ఇండియా ప్రభుత్వపుచట్టం(1915) లోను ఇండియా ప్రభుత్వపు చట్టం (1935) లోని 226 వ నిబంధన ప్రకారము రెవిన్యూవిషయములపై హైకోర్టులకు ఎట్టి అధికారము లేకుండా యున్నది. మన ప్రస్తుత రాజ్యాంగ చట్టంక్రింద ప్రతి హైకోర్టుకు రెవిన్యూకు సంబంధించిన ఏ విషయములోనయినా ఏ రీత్ సంబంధమయిన ఏ కార్యముపైన అధికారము కల్గియుండుట పునరుద్ధారణ చేయబడియున్నది. ప్రస్తుత రాజ్యాంగచట్టము అమలులోనికి వచ్చుటకుపూర్వము మదరాసు, బొంబాయి, కలకత్తా హైకోర్టులు ఆరాజధాని పట్టణములలో అనగా మద్రాసు, బొంబాయి, కలకత్తా పట్టణములలో మాత్రమే ప్రరోహిటిపు రిట్లను మంజూరుచేయగల్గిన అధికారము కల్గి రాజధానిలో క్రిమినల్ ప్రొసీజరు కోడు 491 నిబంధన ప్రకారము హేబియస్ కార్పసు రిట్లు అధికారము చెలాయింపగల్గియుండినవి. కాని ప్రస్తుత రాజ్యాంగ చట్టంక్రింద ప్రతియొక్క రాష్ట్రపు హైకోర్టు తన జ్యూరిస్ డిక్షన్ వున్న స్థలములో ఏ వ్యక్తికిగాని, అధికార సంస్థకుగాని ప్రభుత్వములో సహా ఉత్తర్వులు, రిట్సు (హేబియస్ కార్పస్) తో సహా జారీచేసే అధికారము కల్గియున్నవి. ఈ అధికారము హైకోర్టులకు యివ్వబడి నప్పటికిని సుప్రీంకోర్టు యీ అధికారము యధాతధముగనే చెలాయింపగల్గి యున్నది.

## క్రింది కోర్టులపై హైకోర్టు యొక్క తనిఖీ అధికారము

తాను ఉధికారము చెలాయింపగల్గిన పరిధిలోయున్న ఏ కోర్టు పైన గాని, ట్రిబ్యునల్ పైగాని హైకోర్టు తనిఖీ చేయు అధికారము కల్గియున్నది. ఇంతేకాకుండా.

(1) క్రింది కోర్టులనుండి ఏ రిటర్న్సు అయినా పంపమని కోరుట.

(2) క్రింది కోర్టుల కార్యక్రమము నిర్వహింప వలసిన విధులను నిర్ణయించుట.

(3) క్రింది కోర్టులు ఏ ఏ రికార్డులు గాని, అకౌంట్సుగాని ఏ విధముగా వుంచుకొనవలయునో అట్టి పద్ధతులను సూచించు అధికారములను హైకోర్టులు తమ క్రింది కోర్టులపై కల్గియున్నవి.

రాజ్యాంగ చట్టంక్రింద విశదీకరణ చేయవలసిన ముఖ్య సమస్యపై ఆధారపడియున్న ఏ కేసుగాని క్రింది కోర్టులలో తీర్పునకువున్న యెడల హైకోర్టు అట్టి కేసును తాను తనవద్దకు రప్పించుకుని ఆ కేసును తానే తీర్పు చేయవచ్చును. లేదా ఆ విషయములు పరిష్కరించి తదుపరి విచారణకు, తీర్పుకు హైకోర్టు క్రిందికోర్టుకు పంపవచ్చును. ప్రతి హైకోర్టుయొక్క అధికారమును ఇంకొక ప్రదేశముపై విస్తృతము చేయుటకులేదా ఒక్క హైకోర్టుయొక్క జ్యూరిస్ డిక్షన్ లోనించి ఒక నిర్ణీత ప్రదేశమును కేటాయించుటకు పార్లమెంటునకు అధికారము వున్నది.

ఇట్టి అధికార విస్తృతికల్గిన హైకోర్టు ఒక్కటి ఆంధ్రరాష్ట్రమునకు వుండవలయునని ఆంధ్రా స్టేటు యాక్టు (1953) లో పేర్కొనబడి యున్నది. పైన ఉదహరించినయాక్టు 29వ నిబంధన ప్రకారము ఆనాటికి మద్రాసు హైకోర్టులో న్యాయమూర్తుల విధులను నిర్వహించువారిని రాష్ట్రపతి ఆంధ్రా హైకోర్టుకు న్యాయమూర్తులుగ నియామకము చేయవచ్చును. 30 వ నిబంధన ప్రకారము ఆంధ్ర హైకోర్టు ఆంధ్రరాష్ట్రములో చేరియున్న ప్రతి అంగుళము భూమిమీద ఆ నాటికి మదరాసు హైకోర్టు చెలాయింపగల్గిన ఒరిజనల్, అప్పిలేటు మరియు యితర విధమయిన జ్యూరిస్ డిక్షను ఆంధ్రా హైకోర్టు చెలాయింప గల్గియున్నది. యిందులో గమనింపవలసిన ముఖ్య విషయమేమనగా ఆంధ్రా హైకోర్టు లెటర్సు పేటంటు అప్పిలేటు జ్యూరిస్ డిక్షన్ చెలాయింపగలదా లేదా అనే ప్రశ్నకు తావు లేదు. ఎందుకనగా మదరాసు హైకోర్టు చెలాయింపగల్గిన ప్రతి అధికారము ఆంధ్ర హైకోర్టు తప్పక కల్గియుండవలయును. లెటర్సు పేటంటు అప్పీలు అధికారము హైకోర్టులకు రాణీగారు తమ సీలు వేసిన వారంటుద్వారా యిచ్చినారు. ఆనాడు రాణిగారికి భారతదేశముమీద ఎంత అధికారము వుండినదో సర్వ సార్వభౌమ అధికార పరివేష్టితమయిన భారతపార్లమెంటుకు అంత అధికారమున్నది. ఆ అధికారమును చెలాయిస్తూ భారత పార్లమెంటు ఆంధ్రాస్టేటుయాక్టు అమోదించినది. కనుక ఆంధ్రా హైకోర్టు లెటర్సు పేటంటు అప్పీలు అధికారము కల్గియున్నది. అవిధముగనే అడ్వకేట్ల యొక్క అడ్మిషన్, ఎన్ రోలు మెంటు సస్పెన్షన్, తీసివేత అధికారము మద్రాసు హైకోర్టు కు వున్నట్లే ఆంధ్ర హైకోర్టుకు కూడ వున్నవి. మద్రాసు హైకోర్టులో జూలై 5వ తేది నాటికి అమలులో వున్న సూత్రములు పద్ధతులు ఆంధ్ర హైకోర్టుకు అవసరమనితోచి చేసిన సవరణల తోబాటు అమలులో వుండును. కాని జూలై 5వ తేదీ పూర్వము ప్రాక్టీసు సంబంధించికాని, ప్రొసీజరుకు సంబంధించియున్న ప్రతియొక్క నిబంధన ఉత్తరువు ఆంధ్ర హైకోర్టు సవరించి కాని, రద్దుచేసియున్నయెడల తప్ప చెలామణిలో యుండును. మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగాని, సింగిల్ జడ్జీగాని డివిజన్ కోర్టులుగాని కల్గివున్న అధికారము చేసిన సవరణల ననుసరించి ఆంధ్ర హైకోర్టుకుకూడ వర్తించును. సుప్రీం కోర్టుకు అప్పీలు విధానము మద్రాసుకు వుండినవిధముగనే యధాతధముగ చేసిన సవరణల ననుసరించి వర్తించును. జూలై 5వ తేదినాటికి ఆంధ్రప్రదేశమునకు సంబంధించిన విషయమని యితరపరిస్థితులను బట్టి ఆంధ్ర హైకోర్టే తీర్పు యివ్వవలయునని మద్రాసు ప్రధానన్యాయమూర్తిగారు సర్టిఫై చేసిన విషయములన్నియు తీర్పులకు ఆంధ్ర హైకోర్టుకు వచ్చుచున్నవి. కాని జూలై 5వ తేదీకి పూర్వము మదరాసుహైకోర్టు తీర్పులపై రెవ్యూ అప్లికేషన్లు, అప్పీలు చేసుకొనుటకు అనుమతి కోరు దరఖాస్తులు సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకొనుటకు వలసిన అనుమతి దరఖాస్తులతో సహా యితర దరఖాస్తులను తీసుకొనుటగాని అట్టి మద్రాసు హైకోర్టు వుత్తర్వులపై అప్పీళ్లను విని తీర్పుచెప్పు అధికారము ఆంధ్ర హైకోర్టుకు యివ్వబడలేదు. (సెక్షన్ 46 (3) ఆంధ్రస్టేటు యాక్టు) కాని అట్టి విషయములలో కార్యక్రమమును కొనసాగించుటకు మదరాసు హైకోర్టు జానుకొనిన యెడల మదరాసు ప్రధాన న్యాయమూర్తిగారు అట్టి కార్యక్రమము ఆంధ్ర హైకోర్టుకు మార్చవలెను అని తోచినయెడల ఆంధ్ర హైకోర్టుకు మార్చబడును. ఇట్టి అధికారముల



కీ॥ శే॥ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు

తో కూడిన ఆంధ్ర హైకోర్టు జూలై 5వ తేదీన ఆంధ్రరాష్ట్రములో ఏర్పడుట శుభసూచకము. ఇది ఆంధ్రప్రజలు గర్వింపతగిన ఆంధ్రచరిత్రలో నూతన అధ్యాయము. ఇంతేకాకుండా రాజ్యాంగచట్టంలో పేర్కొనబడిన ఏ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తికిలేని హోదా మన న్యాయమూర్తిగారికి తిరుపతి యూనివర్సిటీ బిల్లు ద్వారా తిరుపతి యూనివర్సిటీకి ఛాన్సలర్ గా వుండుట మరియు విశేషము—మన భాగ్యము.

# గుంటూరు, కృష్ణా జిల్లాల కోర్టుల చరిత్ర

(4 వ పేజీ తరువాయి)

అనెను ఒక యూరపియను సబుకలెక్టరు యెదుట లా రిపోర్టు చదువబోగా దానిని తగలబెట్టుమనెను ఒక సబుకలెక్టరు మారగా క్రొత్తగా వచ్చిన వారి యెదుట తిరిగి ఫిర్యాది సాక్ష్యము తీసికొనవలెననగా వల్లకాదని ముద్దాయిని గదమాయించి సాక్షులను విచారించ కోరగా ముద్దాయి వెంటనే ట్రాన్సుఫరుకు దరఖాస్తు చేయుట తటస్థించెను. ఇటువంటి నెన్నో అవకతవక పనులు యూరపియనులు చేసియుండిరి అవి అన్నియు ప్రత్యేకం తెలియ చేయదగిన వై యున్నవి. చెన్నపట్నంనుంచి బెజవాడకు గల ప్రయాణ సౌకర్యమునుబట్టి ఎందరో ప్రముఖ హైకోర్టు న్యాయవాదులు బెజవాడ సబుకోర్టుకు వచ్చుచుండెడివారు. హైకోర్టు న్యాయవాదులు జిల్లాకోర్టు న్యాయవాదులవలె గాక ఒక్కసారి 500 కట్టి శాశ్వతముగా హైకోర్టు వకీలుపట్టా పొందుచుండెడివారు. తర్వాత ఆ మొత్తము 650 కి పెంచబడెను. కొన్ని సంవత్సరములైన తర్వాత రెండవతరగతి ప్లీడర్ల దగ్గరనుంచి అందరు ప్లీడర్లు కొంత రుసుము చెల్లించి అడ్వకేటులగుటకు వీలేర్పడెను. ఆ రుసుముకూడా తగ్గించబడినది.

## బెజవాడ న్యాయవాదులు

బెజవాడలో 1885 నాటికి 8 మంది ప్లీడర్లుండెడివారు. 1905 నాటికి 16 మందియైరి 1935 నాటికి 111 గురైరి. ఇప్పుడు బెజవాడలో 125 న్యాయవాదులుగలరు బెజవాడ జనాభాకూడా ఆనకట్టకు పూర్వము 2000 లోపుగా నుండి 1866 నాటికి 3270 గను 1871 8000 గను, 1881 నాటికి 13000 లై ఇప్పుడు రెండు లక్షలుగా నున్నది. బెజవాడ సబుకోర్టు ప్రారంభించు నాటికి ఆకోర్టులో న్యాయవాదిగా నుండిన యల్లంరాజు శాస్త్రులుగారు మాత్రము హైకోర్టు వకీలైయుండిరి. 1884 కి పూర్వము గవర్నరుపేటలేదు. 1888 కి పూర్వం మునిసిపాలిటీ లేదు. దరిమిలా ఎన్నో ఫాక్టరీలేర్పడి బెజవాడ ముఖ్య వర్తకస్థానమైనది బెజవాడ జనాభాకు మించిన పట్టణము ఆంధ్ర రాష్ట్రమున లేదు. పూర్వము గుంటూరులో 1860 ప్రాంతమున నుండిన జిల్లాకోర్టు నీటి ఇబ్బందిచేత బందరు జిల్లాకోర్టులో చేర్చబడెను. ఇప్పుడు గుంటూరులో హైకోర్టుతోపాటు యెలెక్ట్రిసిటీ నీటిగొట్టములు మొదలగు సదుపాయము లేర్పడినవి. ఇదివరకే గుంటూరుజిల్లాకు ఆంధ్ర జిల్లాలలో ప్రముఖస్థానంగలదు. హైకోర్టుతో గుంటూరు ఖ్యాతి చాలా హెచ్చగలదు. గుంటూరులో జూలై 5వ తారీఖున కోర్టు స్థాపింపబడు సందర్భమున కృష్ణా గుంటూరు జిల్లాలలోని న్యాయస్థానములను గురించి నాకు తెలిసిన సంగతులను తెలియపరచుచున్నాను. నాకు తెలిసినంతవరకు గుంటూరు న్యాయవాది ఏకా లక్ష్మీనరసింహం గారికంటె పెద్దవారగు న్యాయవాదులు ఆంధ్రలో లేరని నా నమ్మకము. చెన్నపురిలో కూడా లేరనే చెప్పవచ్చును. వారితర్వాత గోవిందరాజుల శ్రీనివాసరావుగారు గలరు. తతిమ్మా న్యాయవాదులందరు 80 సంవత్సరముల వయసుకు లోబడినవారైయున్నారు. ఈ సందర్భములో ముఖ్యమంత్రి బారిస్టరు ప్రకాశం పంతులుగారుఇప్పుడున్యాయవాది కానున్న వ్యాసులవారి వంటివారు. 85 సంవత్సరముల వయస్సులో రాష్ట్ర ప్రభుత్వమును నడుపుచీరులు. ఇతరులెవరైన ఉన్నారో లేదో యని తలంచుచున్నాను. గుంటూరుజిల్లాలో 1905 నుంచి ఒక జిల్లాకోర్టు ఇప్పుడు ఆ జిల్లాలోని మునసబుకోర్టులు 8 సబుకోర్టులు 4 గలవు. బందరు జిల్లాకోర్టులో ఉచ్చట ఇతర కోర్టులలోను 1899 నాటికి 20 మంది న్యాయవాదు లుండెడివారు. ఇప్పుడా సంఖ్య గుంటూరులోను 200 దాదాపునకు చేరుకున్నది. గుడివాడ సబుకోర్టు ఏర్పడే నూజివీడులో ప్రత్యేకం మునసీఫ్కోర్టు ఏర్పాటు చేసి ఇప్పుడు బెజవాడ న్యాయవాదుల సంఖ్య 125 వరకు నందును హైకోర్టులో గుంటూరులో అడ్వకేట్ల సంఖ్య 500 కావచ్చును.

# జిల్లా కేంద్రాలలోని న్యాయవాద సంఘాలు

...న్నాదంపంతులు, బుద్ధవరపు నారాయణమూర్తి, తెన్నేటి విశ్వనాథం, గొట్టిముక్కల జగన్నాథరాజు, కిళాంబి తాతాచార్యులు, డబ్బీరు, బంగారయ్యచెట్టి ప్రభృతులు విశాఖపట్టణం న్యాయవాదులలో ప్రముఖులు.

## శ్రీకాకుళం

శ్రీకాకుళం న్యాయవాదుల సంఘం త్వరలో శతవార్షికోత్సవాన్ని జరుపుకోబోతోంది. 1823 కు పూర్వమే జిల్లా మునసబ్ కోర్టు వుండేది బరంపురంలో జిల్లా కోర్టు ఏర్పడక పూర్వం, 1865 వరకూ జిల్లా కేంద్రంగా శ్రీకాకుళమే ఉండేది. 1936 లో ఒరిస్సారాష్ట్ర నిర్మాణంతో శ్రీకాకుళంలో సబ్ కోర్టు స్థాపించబడింది. విశాఖలో జిల్లాకోర్టు పని చేస్తోంది. 1950 లో శ్రీకాకుళం జిల్లా ఏర్పడింది కాని, ఇంతవరకూ ప్రత్యేక జిల్లాకోర్టు జిల్లా మేజస్ట్రేట్ కోర్టు ఏర్పరచ బడలేదు. ఆంధ్రలో జిల్లాకోర్టు ప్రత్యేకంగా లేని జిల్లా ఇది ఒక్కటే.

శ్రీకాకుళం న్యాయవాదుల సంఘంలో 75 మంది ఉన్నారు జిల్లాలో కల్లా పెద్ద సంఘం. అనేక స్థానిక ప్రజా వ్యవహారాలలో ప్రముఖ పాత్రను నిర్వహిస్తోంది. శ్రీకాకుళం జిల్లాబోర్డు అధ్యక్షుడు, శ్రీకాకుళం మున్సిపల్ కౌన్సిల్ లోని 5 మంది సభ్యులు, శాసన సభలోని ఒక సభ్యుడు ఈ సంఘ సభ్యుల్లో వారే. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి పూర్వం ఈ సంఘంలోని ఒకరు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా పనిచేశారు.

ప్రస్తుతం సంఘానికి శ్రీ పి. విశ్వనాథం గారు అధ్యక్షుడు, పి. వి. రమణయ్య గారు కార్యదర్శి, శ్రీ క. సీతారామస్వామి సంయుక్త కార్యదర్శిగా వ్యవహరిస్తున్నారు.

శ్రీకాకుళంజిల్లా ప్రజా జీవితంలో అనుభవైక ప్రజాభిప్రాయాన్ని వ్యక్తపరిచే రాజకీయ పార్టీల ప్రమేయంలేని ప్రధాన వ్యవస్థగా న్యాయవాదుల సంఘం వ్యవహరిస్తోంది. త్వరలోనే ప్రత్యేక జిల్లాకోర్టు, జిల్లా మేజిస్ట్రేట్ కోర్టు ఏర్పడాలని ఆశిస్తోంది.

## గుంటూరు

ఆంధ్ర రాజధాని కర్నూలులో ఏర్పాటు చేయటం అన్యాయం అయితేకావచ్చు. కాని ఆంధ్ర హైకోర్టును గుంటూరులో స్థాపించటం ఎన్నటికీ అన్యాయం కాజాలదు. ఎండ లెక్కువ అనవచ్చు. సముద్రం, చల్లగాలి లేవనవచ్చు. ఇండ్లకు మంచినీటి కొళాయిలు యింకా రాలేదనవచ్చు. కాని యీ విమర్శ అప్రస్తుతం, నిరసన అసమంజసం. రాజధాని, హైకోర్టు కావాలని అడగని ప్రాంతం, అక్కరలేదని చెప్పిన ఆంధ్రుడు లేడు కదా. అటువంటప్పుడు రెండు మదరాసులోనే వుంచుదామా అంటే వీల్లేకపోయింది. రాజధాని వెంటనే మద్రాసునుండి తరలాలని పట్టుపట్టిన తమిళులు, హైకోర్టు తరలించమని మాత్రం కోరలేదు. హఠాత్తుగా ఆంధ్ర అసెంబ్లీ హైకోర్టు గుంటూరులో పెట్టాలి అని తీర్మానించటంతో వుక్కిరి బిక్కిరి అయ్యారు అసెంబ్లీ తీర్మానాన్ని ఆంధ్రప్రభుత్వం పాటించదులే అని కొందరు అనుకున్నారు. అయితే పాటించి తీరుతుందిఅని ఆంధ్రన్యాయశాఖామంత్రి తెన్నేటి విశ్వనాథం గారు ప్రకటించారు. ప్రెసిడెంటు అమోదం కావద్దా! ప్రకటనకావద్దా! అన్నారు అన్నీఅయినాయి. ఇకరాక తప్పిందికాదు హైకోర్టు వచ్చింది. మద్రాసులోని ఆంధ్ర న్యాయవాదులు వచ్చారు. ఈ ఘట్టంలో ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవం చేసుకుంటున్నాం. సుప్రసిద్ధ న్యాయవాది భారత ప్రభుత్వ హోంశాఖా మాత్యులు శ్రీ కైలాసనాథ కట్జూగారు వైభవంగా ప్రారంభోత్సవం చేస్తున్నారు. కన్నుల పైభవంగా, అమితోత్సాహంతో యీ సభకార్యం జరిగిపోతోంది. ఘటీకు లెందరో విచ్చేస్తున్నారు.

## గుంటూరు అర్హతలు

ఇట్టి గౌరవాన్ని పొందటానికి గుంటూరు న్యాయవాది సంఘానికి అర్హతవుందా? ఏ ప్రమాణాల ఆధారం మీద యీ నిర్ణయం న్యాయం, సముచితం? అని ప్రశ్నించేవారు లేకపోలేదు. అయితే విషయం తెలిసినవారెవ్వరు అట్టి ప్రశ్న వేయనేమో? స్వాతంత్ర్య సమరచరిత్రలో జేకెము లోని న్యాయవాదులే ముందంజవేసి త్యాగంచేసి సిద్ధపడ్డారు. గాంధిజీ, మాళవ్యా, మోతీలాల్, పటేల్ సోదరులు, చిత్తరంజనదాసు, ప్రధాని నెహ్రూ, ముఖ్యమంత్రి ప్రకాశం ప్రభృతులు ప్రముఖులు న్యాయవాదులే కదా. ఇలాగే ఆంధ్రదేశంలో చూస్తే విశాఖపట్టణం ఒక్క విశ్వనాథంగారిని కాకినాడ సాంబమూర్తిగారిని, విజయవాడ కాకేశ్వరరావుగారిని మాత్రం దేశానికిచ్చింది. ఇక గుంటూర్లో చూద్దామంటే దేశభక్త వెంకటప్పయ్యగారు వున్నవ లక్ష్మీనారాయణ బారిస్టరు స్వామి సీతారాం, నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహంరావు వెంకట ప్రముఖవాదులు... వయసులో ... యుశ్శావంతులు స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నవారే కదా? గాంధి మహాత్ముని శంఖారావమును యీ జిల్లాలో న్యాయవాదివృత్తి విసర్జించినంత మంది న్యాయవాదులు మరే జిల్లాలో లేరంటే అతిశయోక్తి కాదు కదా? గుంటూరు న్యాయవాదిసంఘచరిత్ర, యీ జిల్లాలోని స్వాతంత్ర్య సమర చరిత్ర, యించుమించు ఒకటే ననటం సత్యదూరం ఎంతమాత్రం కాజాలదు. ఈ పట్టణంలోని న్యాయవాదుల్లో కారాగారశిక్ష ననుభవించిన వారి జాబితా తిరగేస్తే, శ్రీయుతులు దేశభక్త కొండా వెంకటప్పయ్య, శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, ఘనులైనవారి పేర్లు కనుపిస్తవి. స్వాతంత్ర్య సమరానికి యింతమంది యోధులైన న్యాయవాదులను సమర్పించిన గుంటూరు న్యాయవాద సంఘ చరిత్ర ఆంధ్రదేశపు న్యాయవాదుల చరిత్రలో అతిప్రముఖ స్థానం ఆక్రమించటంలో ఆశ్చర్యం లేదు.

## సంప్రదాయాలు

ఈ సంఘ సంప్రదాయాల్ని పరిశీలిద్దామా! స్వతంత్రేచ్ఛ, నిర్భయం పౌరహక్కులను సంరక్షించటంలో పట్టుదల ప్రస్ఫుటమవుతవి. ఈ సంఘం బాల్యావస్థలో నుండగానే, ప్రభుత్వము వారు సైమన్ కమిషనును నియమించినందులకు తమ అవిశ్వాసాన్ని ప్రకటించి, న్యాయవాదులందరు సైమన్ కమిషనును బహిష్కరించవలసిందిగా ప్రకటించి తనసాహసాన్ని ప్రకటించుకున్నది. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్న వీరులను ప్రభుత్వం అవమానపంగా అవమానానికి గురిచేసినప్పుడు, ఎలుగెత్తి తననిరసనను చాటి గుంటూరు న్యాయవాద సంఘం తన ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకున్నది. మరల అదేసంవత్సరంలో ప్రభుత్వాధికారులు గాంధీటోపీ ధరించటం నేరమని గాంధీటోపీ ధరించటాన్ని నిషేధిస్తే పట్టుదలతో వ్యవహరించి, హైకోర్టువరకూపోయి, ఆనిషేధాన్ని తొలగించి తన సహజన్యాయ స్వభావాన్ని ప్రదర్శించుకొంది. ఇట్టి సాహస కార్యకలాపాలకు సంబంధించిన తీర్మానములుగల సంఘ మినిట్సు బుక్కును అధికారులు తమయెదుట దాఖలుచేయాలని ఆజ్ఞలుజారీచేసినప్పుడు అలాచెయ్యటానికి వీలులేదని చిత్తస్థైర్యంతో జవాబుచెప్పి తన పరువు ప్రతిష్ఠలను యినుమడింప జేసుకున్నది. దేశభక్తుని విచారణ సందర్భంలో మేజస్ట్రేటుల నిస్సహాయస్థితిని హైకోర్టు దృష్టికి తీసుకెళ్ళింది. న్యాయవాదులైన శ్రీ కె. వి. రెడ్డిగారు, 1936 మేలో ప్రథమ ఆంధ్ర గవర్నరుగా నియమింపబడినందులకు వారిని అభినందించిన యీ గుంటూరు న్యాయవాది సంఘం, వారి నాయకత్వంక్రిందనే ఒక తాత్కాలిక ప్రభుత్వము నేర్పరుస్తూ, తిరువాత మరో గవర్నరు చేసిన చర్య అక్రమము, చట్టవిరుద్ధమని 31-3-37న తీర్మానం చేసి తమ న్యాయబుద్ధిని ప్రకటించుకున్నది. అప్పుడు దీని ఫలితంగా రాజకీయాల్లో పాల్గొంటున్నారనే నెపంమీద అప్పటి జిల్లాజడ్జి "మీరు న్యాయవాద సంఘ కార్యాలయాన్ని ఖాళీ చేయాల్సింది" అని 'క్విట్' ఆజ్ఞ జారీ చేసినప్పుడు అది తప్పని, న్యాయవాది సంఘ జీవితములో అనవసరంగా జోక్యం కలుగ జేసుకోటం అక్రమమని నిర్భయముగా ప్రకటించి, అవసరమైతే ఆఫీసును ఖాళీచేసి యితర ఏర్పాట్లు చేసుకొంటూ, యీ 'క్విట్' ఆజ్ఞ అనవసరము, అన్యాయము, అక్రమము అని న్యాయస్థానాల్లో వాదించి, పోరాడి, చివరకు విజయము గాంచి తన అకుంఠిత కార్యదీక్షను ప్రదర్శించుకున్నది ఇటు స్వతంత్ర పంథాలో నడుస్తూ కూడా న్యాయాధికారులతో ఎప్పుడు అన్యోన్యంగానే మెలుగుతూ, వారల గౌరవాన్ని, విశ్వాసాన్ని మన్ననలను, చూరగొన గలిగింది అయితే న్యాయాధికారులు అవినీతికి పాలుపడినప్పుడు మాత్రం సహించేది కాదు. గుట్టుబయట పెట్టవలసిందే అట్టివారిని గౌరవించేదిలేదు. ఒక సందర్భంలో నూతన న్యాయాధికారుల రాక సందర్భంలోనో, వారు మరోచోటకి బదిలీ అవుతుంటేనో, జ్ఞాపకం లేదు అట్టివారికి స్వాగత సన్మానాలు కాని వీడ్కోలు విందులు కాని చేయకూడదని నిర్ణయించుకున్నారు. ముందు తరం వారికి కూడ మార్గదర్శిగా నుండేందుకు, సంఘ సభ్యులలో మూడింట రెండువంతులు కావాలని అభిప్రాయపడితే తప్ప అట్టి సన్మానాలు విందులు చెయకూడదని, తీర్మానించారు- అట్టిది యీ సంఘము యొక్క ఆత్మాభిమానం. ఒక జిల్లా జడ్జి హయం కాలం ప్రొగ్గుపోయినా కోర్టు కాగితం వై అట్టి అసమంజస విధానాన్ని అంతమొందించ వలయునని ఒక పబ్లిక్ ప్రాసిక్యూటరుగారు "హాయంత్రం అయిదు గంటలయింది ఇక నేను శెలవు తీసుకుంటాను" అని జిల్లా జడ్జి విచారణ చేస్తూ వుండగానే నిర్భయంగా బయటకు నిష్క్రమించటం జరిగింది.

## పూర్వచరిత్ర

ఇట్టి ప్రఖ్యాతి గడించిన గుంటూరు న్యాయవాద సంఘం పుట్టు పూర్వోత్తరాలు విచారిద్దాం. దాదాపు ఒక శతాబ్దం క్రిందట గుంటూరు పట్టణం జిల్లా కేంద్రమై జిల్లాకోర్టుకు స్థానమై వుండేది. కాని ఎందుచేతనో తెలియదు జిల్లా కేంద్రం మచిలీపట్టణానికి మార్చబడింది. మరల దాదాపు అర్ధశతాబ్దం క్రిందట, అంటే 1905 లో అనుకుంటా, గుంటూరు పట్టణం జిల్లా కేంద్రమై, జిల్లా కోర్టుకూడ స్థాపింపబడింది. అప్పటినుండి యిప్పటి వరకు ఎంతో సమర్థతతో అంతరాయమేమీ లేకుండా వ్యవహారం జరుగుతోంది. అప్పుడే మచిలీపట్టణంలోను, జిల్లాలోని యితర ప్రాంతాల్లోను ప్రాక్టీసు చేస్తున్న ప్లీడర్లు గుంటూరుకు వచ్చి నివాసం ఏర్పరచుకొన్నారు. అట్టివారిలో ప్రథములు మన దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు. ఆనాడు ఎంతమంది యిచ్చట ప్రాక్టీసు చేసేవారో సరిగ్గా తెలియదు. కాని ఒక పది పదిహేను కన్నా హెచ్చుమంది వుండేవారు కారేమో అనిపిస్తుంది. ఎందుచేతనంటే 1905 లో జిల్లాకోర్టు స్థాపింపబడి న్యాయవాది సంఘమేర్పడి పనిసాగిస్తున్నా 1924లో గాని అసంఘంరిజిస్టరయి నిబంధనలు ఏర్పడలేదు. లెక్కలను బట్టి ఆనాడు 45 మంది ప్లీడర్లు యిచ్చట వృత్తి చేసేవారని తేలింది 25 సంవత్సరముల అనంతరం అనగా 1949 లో మహా వైభవంగా రజతోత్సవం జరుపుకొన్ననాటికి యిచ్చట ప్రాక్టీసు చేస్తున్న వారిసంఖ్య 130 కు పెరిగి 1953 సంవత్సరానికి సుమారు 180 వరకు వచ్చిందనుకుంటాను. సమర్థులని పేరు గణించి ఎంతో ఘనంగా జీవితం వెళ్ళబుచ్చుకొని కీర్తిశేషులైన న్యాయవాదుల పేర్లు యీ సమయంలో మనం స్మరించటం ఎంతో అవసరమనుకుంటాను. దేశభక్త కొండా వెంకటప్పయ్య, వింజమూరి భావనాచారి, గొల్లపూడి రామనాథయ్య, కాకాని పుండరీకాక్షుడు, ధామరాజు దేవరాజా, కొంపల్లి కోటిలింగం, బారిస్టరు వేపా, ఏకా దండయ్యపంతులు, ఏకా రామయ్యపంతులు, కె. మన్నారు కృష్ణారావు మొదలగు మేధావులు చిరస్మరణీయులు. జిల్లా కోర్టు స్థాపింపబడిన నాటినుండి న్యాయవాదవృత్తిలో ప్రముఖస్థానం అలంకరించి వృద్ధాప్యంలో యిప్పుడు విశ్రాంతి తీసుకుంటూ సుఖంగా జీవితం గడుపుతూ వున్నవారిలో ప్రముఖులు శ్రీయుతులు ఏకా లక్ష్మీనరసింహంపంతులు, గోవిందరాజుల శ్రీనివాసరావు, రాయప్రోలు లింగనసోమయాజీ, విష్ణుభొట్ల సూర్యనారాయణ, మాడభూషి వేదాంతం నరసింహాచార్యులుగారలు, వున్నవ లక్ష్మీనారాయణ, గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామి సీతారాం) గారలు.

## కేసుల వివరాలు

ఇక కోర్టులసంఖ్య వ్యాజ్యాలసంగతి విచారిద్దాం. ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాలలోకి యీ జిల్లా జనసంఖ్య యెక్కువ; కోర్టు లెక్కువ; కేసులు కూడ ఎక్కువే. ఈ విషయం తెలుసుకొంగానే అన్నాడు ఆంధ్రగవర్నరు త్రివేది.

"వ్యాజ్యాలు యెక్కువకావటం మంచి లక్షణమో అవలక్షణమో మీరే నిర్ణయించుకోండి" అన్నారు కాని వున్న వాస్తవం మనవిచేస్తున్నాం. వ్యాజ్యాలు పెరిగిపోతున్నాయి. కాబట్టి కోర్టు లెక్కువవుతున్నవి. జడ్జీలకు మున్సిఫ్ లకు పని ఎక్కువవుతున్నవి. లేకపోతే యీ జిల్లాలో కోర్టెందుకు, హైకోర్టు యిదు దిక్కుడ ప్రారంభించట మెందుకు? ఈ జిల్లాలో యిద్దరు జిల్లా సెషన్సుజడ్జీలు, ఆరుగురు సబ్ జడ్జీలు, తొమ్మిదిమంది మున్సిఫ్ లు, వున్నారు వీరికి తోడు యిద్దరు జిల్లా మేజస్ట్రేట్లు, నలుగురు సబ్ డివిజనల్ మేజస్ట్రేటులు, ఆరుగురు ఫస్టుక్లాసు మేజస్ట్రేటులు, ఇంకా వీరుకాక ఎంతమందో ఫస్టుక్లాసు బెంచి మేజస్ట్రేటులు, సెకండుక్లాసు మేజస్ట్రేటులు యీ జిల్లాలోని కేసులను విచారించి తీర్పులు చెపుతున్నారు. ఆంధ్రదేశములోని అన్ని జిల్లాలలోకి యీ జిల్లాలోనే సివిల్ అప్పీళ్లు ఎక్కువ. ఆంధ్రలోని 12 జిల్లాల్లోని సివిల్ అప్పీళ్లు 1782 అయితే, ఒక్క గుంటూరుజిల్లానుంచే 421 సివిల్ అప్పీళ్లు తరువాతి స్థానం పశ్చిమ గోదావరిజిల్లాది. 285 సివిల్ అప్పీళ్లు. క్రిమినల్ అప్పీళ్లు యిదే నిష్పత్తిలో వుంటవి.

గుంటూరుకు ఉత్తరాన వున్న ఐదు కోస్తా జిల్లాలనుండి 1003 అప్పీళ్లు హైకోర్టుకు వెళ్లితే, గుంటూరుకు దక్షిణానున్న 6 జిల్లాలనుండి అనగా నెల్లూరు, చిత్తూరు జిల్లాలుకూడ కలుపుకొని 358 అప్పీళ్లు వెళ్ళలేదు అనగా ఈ 6 జిల్లాల నుండి హైకోర్టుకు వెళ్లే అప్పీళ్ల కన్నా ఒక గుంటూరు జిల్లానుంచి వెళ్ళే అప్పీళ్లసంఖ్య ఎక్కువన్నమాట. కాబట్టి గుంటూరులో హైకోర్టు ఏర్పాటు చేయటంలో అన్యాయమేమి లేదుకదా! అర్థమవుతుంది కాబట్టే అవతరించింది ఆంధ్ర హైకోర్టు ఇచట!

| | జిల్లా పేరు | జనసంఖ్య | హైకోర్టుకు అప్పీళ్ల సంఖ్య | జిల్లాలో కోర్టులు: జడ్జి కోర్టు | సబ్ కోర్టు | మున్సిఫ్ కోర్టులు |
|---|---|---|---|---|---|---|
| 1 | గుంటూరు | 22,77,283 | 421 | 1 | 6 | 9 |
| 2 | విశా, | | | | | |
| 3 | శ్రీకాకుళం కలిపి | 36,21,519 | 256 | 1 | 3 | 8 |
| | | | | 1 | 5 | 7 |
| 4 | ప. గోదావరి | 18,90,294 | 285 | 1 | - | 4 |
| 5 | అనంతపురం | 18,14,818 | 29 | 1 | 2 | 7 |
| 6 | చిత్తూరు | 16,32,395 | 69 | 1 | 2 | 5 |
| 7 | నెల్లూరు | 16,10,026 | 78 | 1 | 4 | 6 |
| 8 | తూ. గోదా. | 14,62,698 | 257 | 1 | 5 | 6 |
| 9 | కృష్ణా | 14,41,294 | 195 | 1 | 3 | 4 |
| 10 | కర్నూలు | 11,88,821 | 64 | 1 | - | 5 |
| 11 | కడప | 10,26,507 | 85 | 1 | 1 | 5 |
| 12 | బళ్లారి | 10,51,235 | 33 | | | |

ఈ క్రింది జాబితాలనుపట్టి గుంటూరు అర్హతలు యింకా వివరంగా నిరూపింప బడుతవి.

ఇన్ని యోగ్యతలు, అర్హతలుగల యీ జిల్లా కేంద్రమైన గుంటూరుపట్టణంలో ఆంధ్ర హైకోర్టు ఏర్పడుతుందంటే సంతోషించనివారుండరు. అటు కోస్తా జిల్లాలకు యిటు రాయలసీమ నెల్లూరుజిల్లాలకు మధ్యలోవున్న యీ జిల్లా ఉత్తరాన కృష్ణాజిల్లాతోను, దక్షిణాన నెల్లూరుజిల్లాతోను, పశ్చిమాన కర్నూలు జిల్లాతోను కలిసి వున్నది.

## భవనాలు

ఇక భవనాలసంగతి ఒక్కమాట. పాత కలెక్టరుఆఫీసు భవనానికి మెరుగులు పెట్టి, ముందు మరో భవనం కట్టుతున్నారు కదా. ఇపుడు ప్రస్తుతం 5000 చదరపు అడుగుల వైశాల్యంవరకే పూర్తి అవుతుంది. మొత్తం 12000 చదరపు అడుగుల వైశాల్యంలో భవనం తొందరలోనే పూర్తిఅవుతుంది. ఇంజనీర్లు అతిశ్రద్ధగా చురుకుగా పనిచేశారనే చెప్పాలి. మే 15న ప్రారంభించి నెలా పది హేను రోజులలో పూర్తి చేయటం అంటే మాటలుకాదు కదా! అయితే విడిగా నూతనభవనం కట్టే బదులు పాత భవనం మీద నే మరో అంతస్థు కట్టినట్లయితే చాల దర్జాగా వుండేదే. అయితే పునాదులబలం చాలదని ఇంజనీర్లు భయపడినట్లు కనిపిస్తున్నది. ఈ నూతనభవనం 'E' ఆకారంలో కట్టుతున్నారు. ప్రస్తుతానికి రెండో అంతస్తే మీ లేదు. భవనం డాబాకాదు మెంగళూరు పెంకుతో గబుల్. అందువల్ల నూతనభవనం అందంగా లేకపోవటమే కాకుండా పాతభవన సౌందర్యం కూడ చెడకొట్టుతున్నారనే చెప్పాలి ఈ ఆవరణలోనున్న రిజిస్ట్రారు ఆఫీసు, ట్రయినింగుస్కూలు ఎట్లాగో తీసుకున్నారు. జిల్లాపోలీసు ఆఫీసుకూడ తీసుకుంటారనుకుంటాను. కాని యిదే ఆవరణలో వున్న ఫైర్ సర్వీసు స్టేషను, ఎస్సు సర్వీస్ మన్సు ట్రాన్సిట్ కార్యాలయం మొదలయినవి, అక్కడున్న పాయిఖానా దొడ్లు యివన్నీ కూడ తీసేస్తే తప్ప మంచిరూపం రాదు. నర్సరావుపేట, మాచర్ల నుండి రైలులో వచ్చే జనానికినూతనభవనాలుఏమాత్రం అందంగా కనుపించవు. భవనాలకు దక్షిణంవైపు లాగానే ఉత్తరంవైపు కూడ పెద్ద కాంపౌండు గోడకట్టటం చాల అవసరం.

## కర్నూలు

దాదాపు అర్ధశతాబ్దం క్రిందట ముప్పయి మందికంటె తక్కువ మంది సభ్యులతో కర్నూలు న్యాయవాదుల సంఘం చాలా నిరాడంబరంగా ప్రారంభమయింది. అప్పటి జిల్లా మున్సిఫ్ శ్రీ ఆర్. ఎ. కృష్ణస్వామి అయ్యర్ గారి కృషికారణంగా 1902 ఆ ప్రాంతంలో యేర్పడ్డ ఈ సంఘం క్రమంగా అభివృద్ధి చెందింది. ఈ నాడు యీ సంఘంలో డెబ్బయిమంది కంటె ఎక్కువమంది సభ్యులున్నారు.

ప్రారంభంలో ఈ సంఘం తన కార్యాలయాన్నీ, గ్రంథాలయాన్నీ యేర్పాటు చేసుకొనడానికి ఒక గది లేకపోయింది. ఇప్పుడు కర్నూలుజిల్లా కోర్టు, జిల్లామున్సిఫ్ కోర్టు ఏ భవనాలలో వుంటున్నవో, అవే భవనాలలో అప్పుడు కూడా యీ కోర్టు లుండేవి. ఇక న్యాయవాదుల సంఘం ఆ భవనాల వరండాలలో వీలయినచోట్ల తన కార్యాలయం ఏర్పాటు చేసుకొంటూ వుండేది మరొక విషయం ఏమిటంటే జిల్లాజడ్జి ఆ రోజులలో సెషన్సు కోర్టును విడవకుండా కర్నూలులోనే జరుపుతూండేవారు కాదు. కొన్నాళ్లు బళ్ళారిలోనూ, మరికొన్నాళ్లు కర్నూలులోనూ సెషన్సుకోర్టు జరుగుతూండేది. ఆ తరువాత 1930 లో కె. అప్పాజీరావుగారు జిల్లాజడ్జిగా వుంటున్న రోజులలో ఇప్పుడు రాష్ట్ర శాసనసభ వుంటున్న భవనంలోకి జిల్లా కోర్టును మార్చారు. అంతట అదివరకు దాకా జిల్లాకోర్టు ఉంటూ వచ్చిన పాతభవనంలోకి జిల్లామున్సిఫ్ కోర్టును మార్చారు.

1953 లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడగా, రాజధాని కర్నూలులో ఏర్పాటుచేసినందున రాష్ట్ర శాసనసభకు భవనం చూపించడానికిగాను జిల్లాకోర్టును తిరిగి పాతభవనాలలోకి మార్చవలసివచ్చింది ఇప్పుడు ఆ భవనంలోనే జిల్లాకోర్టు ఉంటున్నది, కనుక జిల్లా మున్సిఫ్ తిరిగి తన స్వస్థానమైన పాత విభాగంలోకి వెళ్లింది.

జిల్లా జడ్జీల ప్రోత్సాహంవల్ల, న్యాయవాదులలో ప్రముఖుల ఆసక్తితోనూ న్యాయవాదుల సంఘం దినదినాభివృద్ధి చెందింది. 1913 లో సంఘం రిజిస్టరు చేయబడేవరకూ దానికి లిఖితపూర్వక నియమావళిలేదు. అప్పటు జిల్లా మున్సిఫ్ గా పనిచేసిన దివాన్ బహద్దూర్ సి. వి. కృష్ణస్వామిఅయ్యరుగారు ఈ న్యాయవాదుల సంఘం నిబంధనావళిని తయారుచేశారు. వరుసగా ఆరుసార్లు పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా పనిచేసిన రావ్ బహద్దూర్ శేషశాస్త్రిగారు ఈ సంఘానికి మొదటి అధ్యక్షుడు. దివాన్ బహద్దూరు రంగారెడ్డి, రావ్ బహద్దూర్ ఎస్ నరసింహారావు, ఎస్. రంగాచార్యులు ప్రభృతి ప్రముఖ న్యాయవాదులు ఈ సంఘం అధ్యక్షులుగా పనిచేశారు. ప్రస్తుతం ఈ సంఘానికి పి. లక్ష్మీరెడ్డిగారు అధ్యక్షుడు, దీక్షితులుగారు కార్యదర్శి. లక్ష్మీరెడ్డిగారు ఇప్పుడు పబ్లిక్ ప్రాసిక్యూటరు కూడా. ప్రస్తుతం వృత్తి నేర్చుకొంటున్న న్యాయవాదులందరూ పూర్తిగా యీ వృత్తిలో చేరితే యీ సంఘంలో నూరుమంది సభ్యులుంటారని అనుకొంటున్నారు.

ఈ న్యాయవాదుల సంఘాన్ని మదరాసు రాష్ట్ర న్యాయవాదుల సంఘానికి అనుబంధించారు. లక్ష్మీరెడ్డిగారు ఈ న్యాయవాదుల సంఘానికి అధ్యక్షులుగా వుండగా రాష్ట్ర న్యాయవాదుల సంఘ సమావేశం సి. టి. రాజన్ గారి అధ్యక్షతన ఇటీవలఇక్కడ జరిగింది.

ఈ సంఘానికి లోగడ అధ్యక్షుడుగాపనిచేసిన దివాన్ బహద్దూర్ రంగారెడ్డిగారు 1928 లో మహారాయ జేనాదాయాల బోర్డు అధ్యక్షుడుగా నియమించ బడ్డారు. ఇక్కడి జిల్లాకోర్టు న్యాయమూర్తులుగా పనిచేసిన కొందరు న్యాయమూర్తులు హైకోర్టు బెంచి సభ్యులుగా నియమించ బడ్డారు. అట్టివారిలో శ్రీ హెచ్. ఆర్. ఐరాడ్సెల్, శంకరమీనన్, పి. ఎస్. రామస్వామి, పి. రాజగోపాలన్ ప్రభృతులు ప్రముఖులు. శ్రీయుతులు రామస్వామి, రాజగోపాలన్ గారలు ఇప్పుడు మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులు.

కర్నూలు న్యాయవాదుల సంఘ సభ్యులలో శాసనసభకు ఎన్నికయిన న్యాయవాదులు కూడా వున్నారు. అనేక జిల్లాలలో క్రిమినల్ లాయరీ గా వినుతికెక్కిన జి. లక్ష్మణస్వామిరావ్ ఎ. రామకృష్ణారెడ్డి, దివాన్ బహద్దూర్ సి. వి. రంగారెడ్డి గారలు మద్రాసు రాష్ట్ర శాసనసభ సభ్యులుగా పనిచేశారు. శ్రీయుతులు అబ్దుల్ సత్తార్, అలిరిజా, ఎస్. వెంకటరామయ్య, కె. గోపాలయ్య, అబ్దుల్ రహిమాన్ ఖాన్ ఎమ్. రామమూర్తి మున్నగు ఈ సంఘ సభ్యులు జిల్లా మున్సిఫ్ లు అయ్యారు. వారిలో కొందరు జిల్లాజడ్జీలు కూడా అయినారు.

పట్టణ పౌర వ్యవహారాలలో కూడా కర్నూలు న్యాయవాదుల సంఘ సభ్యులు చాలా శ్రద్ధ చూపించారు. ఇంకా శ్రద్ధగా పనిచేస్తున్నారు శ్రీయుతులు ఎస్. రామస్వామి, కె. అప్పయ్యశెట్టి, చిదంబరరావ్ (ఈపట్టణంలో కొన్ని వీధులకు ఆయనపేరు పెట్టారు), రావ్ బహద్దూర్ ఎస్. నరసింహారావు (నరసింహారావ్ పేట ఆయనపేరుమీద పెట్టినదే) ఎస్. నరసింహులు ప్రభృతులు కర్నూలు పురపాలక సంఘం అధ్యక్షులుగా పనిచేశారు

ఈ సంఘసభ్యులలో ఒకరయిన కె. శ్రీనివాసరావ్ గారు నేరుగా ఫస్టుగ్రేడ్ సబ్ జడ్జిగా నియమించబడి, కొన్ని సంవత్సరాలపాటు ఇక్కడ జిల్లాసెషన్సు జడ్జిగా పనిచేశారు. ఈసంఘసభ్యుడు దివాన్ బహద్దూర్ రంగారెడ్డిగారు జిల్లాబోర్డు అధ్యక్షుడుగా పనిచేశారు. స్థానిక న్యాయవాదులలో ఆయన ప్రముఖుడు. శ్రీయుతులు ఎస్. నరసింహారావ్, ఎస్. నరసింహులు, పి. కేశవరావ్, కె. అప్పయ్యశెట్టి, రావ్ బహద్దూర్ టి. ఆర్. రామచంద్రశాస్త్రి, ప్రభృతులు సహకారోద్యమంలో పాల్గొని దాని అభివృద్ధికి చాలా సహాయపడ్డారు.

ఈ సంఘసభ్యులలో చాలామంది జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో కూడా పాల్గొన్నారు. శ్రీయుత బి. వి. సుబ్బారెడ్డి (ఈయన కొంతకాలం జిల్లాబోర్డుఅధ్యక్షుడుగా కూడా పనిచేశారు), పి. లక్ష్మీరెడ్డి, చంద్ర వెంకటరెడ్డి, ఎమ్. సుబ్బారెడ్డి (ఇప్పటిశాసనసభ్యుడు), వి. నారాయణమూర్తి (స్వాతంత్ర్యోద్యమంలో వృత్తి వదలివేశారు. ఈయన) ప్రభృతులు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న న్యాయవాదులలో ప్రముఖులు.

## గుడివాడ

గుడివాడలో మునసబుకోర్టు 1892 సం॥ స్థాపించబడింది. 1904 సం॥ లో ఈ కోర్టుకు స్వంతభవనం కట్టబడింది అప్పట్లో మెట్రిక్ ప్యాసు అయి ఎనిమిది(8)మంది ప్లీడర్లు ఈకోర్టులో ప్రాక్టీసుచేయ ప్రారంభించారు అందులో ముఖ్యులు మాడభూషి నరసింహాచార్యులు, తుమ్మలపల్లి గోపాలకృష్ణమూర్తి, సూరి వెంకటసుబ్బరాయశాస్త్రి (భగవంతంగారితండ్రి) పండ్రంగి ఆనందరావు, ఉప్పలూరి మల్లికార్జునరావు పంతులుగార్లు. తరువాత 1908 సం॥ బార్ అసోసియేషను ప్రారంభించారు. ప్రథమంగా తు. గోపాలకృష్ణమూర్తిగారుఅధ్యక్షులుగా ఎన్నిక అయ్యారు వీరిలో శ్రీ మా. నరసింహాచార్యులుగారు పార్లమెంటు ప్లీడరుగా వుండేవారు. వీరికి లాండు రెవిన్యూకేసుల్లో అసమాన పరిచయం వుండేదట. తరువాత తరంలో అనగా 1915 ఆ ప్రాంతాలలో ప్రాక్టీసుకు వచ్చి న్యాయవాదవృత్తి అభ్యసించిన వారిలో ముఖ్యులు ఉప్పలూరి ఉదనారాయణమూర్తి, నండూరి రాజగోపాలం, ... సుబ్బయ్య, శివలెంక

(9 వ పేజీ చూడుడు)

# చైనా సభ్యత్వానికి అమెరికా ప్రాతికూల్యం

## డెమొక్రటిక్ నాయకుని హెచ్చరిక

పోర్ట్‌లాండ్, జులై 3: "సెనెటర్ విలియం నోలండు, ఇంకా అతనివంటి వాళ్లు సమితిలో చైనాకు ప్రవేశం యిస్తే, అమెరికా బయటకు వచ్చెయ్యాలని చేస్తున్న ప్రచారం అంతా అజ్ఞానంతో కూడినట్టిదే గాక ఉపద్రవకారి కూడా" అని అమెరికా డెమాక్రటిక్ పార్టీ నాయకుడు ఎడ్‌లాయ్ స్టీవెన్‌సన్ నేడు యిక్కడ హెచ్చరించారు.

ఇట్టి వారి మాటలవల్ల కలిగే ఫలితం ఏమిటంటే మిత్ర రాజ్యాల మధ్య స్నేహం విరిగిపోతుంది. కమ్యూనిస్టులకు అంతకన్నా కావలసింది ఇంకా ఏమీ లేదు. వూరికే బెదిరించడం వల్ల, విమర్శించడంవల్ల స్నేహితులను కట్టుకోగల మనుకోవడం భ్రమ. అందుకు కొంత బ్రతిమాలడం, కొంత ఇచ్చి, పుచ్చుకోవడం వుండాలి అన్నారు.

చైనాకు సమితిలో ప్రవేశం ఇవ్వడం తనకు ఎంతమాత్రం వచ్చదని, తాను 'శాంతియుతమైన విధానాలను అనుసరిస్తున్నట్లు రుజువు చేసుకొనే దాకా చైనాను సమితిలో ప్రవేశించనీయరాదని కూడా ఈ స్టీవెన్‌సన్ అన్నారు.

అయితే నోలండు ప్రభృతులు సమితిలో చైనా ప్రవేశాన్ని నిరోధించడానికి అన్ని ప్రయత్నాలు చేస్తున్నారు. అమెరికా ఇతర దేశాలకు ఇచ్చే సహాయాలను రెండింతలకు దించాలని, అందువల్ల తను ప్రయత్నం సెగ్గతుందని ఇప్పుడు వీరు ఆలోచన చేస్తున్నారు. ఈ నెలల కాల వ్యవధి పద్ధతేగాక ఇంకా అనేక మార్గాలను తాము ఆలోచిస్తున్నట్లు వీరు చెబుతున్నారు. సమితిలో చైనా ప్రవేశాన్ని నిరోధించడానికి వీరు వేస్తున్న బహు ఎత్తుల్లో ఇది ఒకటి మాత్రమేనని పరిశీలకులు అంటున్నారు.

ఆ ఇతరమైన ఎత్తుల్లో ఒకదానిని సెనెటర్ నోలండ్ నేడు బయట పెట్టారు. సమితిచేత అదివరకు దురాక్రమణ జరిపినట్లు ప్రకటించబడిన పరాజ్యాన్ని గాని, సమితిలో ప్రవేశించనిచ్చినట్లయితే అమెరికా సమితికి ఇస్తున్న విరాళాలను తగ్గించివేసేటట్లు మాస్తాం అని ఈయన అంటున్నారు.

నోలండు ప్రభృతి నాయకుల ఇట్టి ప్రకటనలవల్ల ఎవరు నిజంగా అమెరికా విదేశాంగమంత్రో తెలియకుండా పోతోందని డెమాక్రాటిక్ పార్టీ నాయకుడు ఎస్‌లాయ్ స్టీవెన్‌సన్ డెలివర్‌లో మాట్లాడుతూ విమర్శించారు. అమెరికా విదేశాంగమంత్రి డల్లెస్సో, లేక నోలండో, లేక నిక్సనో, తెలియకుండాపోతున్నదని, ఈ అందరు తమదే అధికారం అన్నట్లు మాట్లాడుతున్నందువల్ల శత్రువులకు లాభం కల్గుతున్నదని, వాషింగ్టన్‌లో ప్రభుత్వానికి జాడ్యం ప్రాప్తించింది అనడానికి ఇది చిహ్నమని ఆయన ఈ సందర్భంలో విమర్శించారు.

# ప్రధాన ఫ్రెంచి స్థావరం ఫూలీ వీట్మిన్ల వశం

## హానాయ్‌కి 30 మైళ్లలోవున్న పట్నం

పారిస్, జులై 3: ఇండొచైనాలో ఎర్రనది డెల్టాలో ఫ్రెంచివారు కొత్తగా ఏర్పాటు చేసుకున్న రక్షణ వలయంలో నైఋతి మూలగావున్న ప్రధాన సైనికస్థావరం ఫులీ నేడు వీట్‌మిన్‌ల వశం అయింది. ఫ్రెంచివారు దీన్ని వదిలివేశారు.

ఈ స్థావరం హానాయ్‌కి దక్షిణంగా 30 మైళ్ల దూరంలో వుంది. వీట్‌మిన్‌లు నేడు దీనిమీద యాత్ర సాగించారు. ఫ్రెంచివారు తాము యాత్రను పరాస్తం చేసినట్లు ఒక ప్రకటన చేశారు. కాని అనంతరం దాన్ని వీట్‌మిన్‌లకు వదిలి వెళ్లారు.

ఇక ఇప్పుడు వీట్‌మిన్ సేనానాయకుడు జనరల్ గియాప్ ఏమిచేస్తాడు అన్న విషయాన్ని గురించి ఫ్రెంచివారు అనేకమయిన ఊహలు పడుతున్నారు. (1) ఇప్పుడు ఈ స్థావరాన్ని వదిలిపోయిన ఫ్రెంచి సైన్యం హానాయ్ చేరుకోకుండా రోడ్లన్నింటిని అరికట్టివేస్తాడు. (2) హానాయ్ మీద వంటనె దండయాత్రను ప్రారంభించకుండా, సైన్యాన్నంతా ముందు సమకూర్చుకుంటాడు.

ఇప్పుడు వీట్‌మిన్‌ల వశమయిన ఫులీ స్థావరం హానాయ్, హైఫాంగ్ లను రక్షించుకోడానికి ఫ్రెంచివారు పన్నిన రక్షణ వలయంలో ఒకముఖ్యమైన కేంద్రం దీన్ని వదిలిపెట్టిన అనంతరం ఫ్రెంచివారు దానిమీద బాంబులు, అగ్గి వేసి, నగరాన్ని నాశనం చేసినంత పనిచేశారు.

ఫ్రెంచివారు ఎర్రనది డెల్టాలో దక్షిణ ప్రాంతాన్ని వదిలివచ్చి సరిగ్గా రెండు గంటలయినా కాకముందే వీట్‌మిన్‌లు ఈ స్థావరంమీద పడ్డారు. ఫ్రెంచివారు బాంబులు, విమానాలు, భారీతుపాకులు ఉపయోగించి, ఈదండయాత్రను ప్రతిఘటించామని యత్నించారుగాని మధ్యాహ్నం అయ్యేసరికి పసతిగ్గిపోయింది. దానితో వున్న సైన్యాన్ని, పట్టణ ప్రజను వెంటబెట్టుకొని, దాన్ని ఖాళీచేయడం మొదలు పెట్టారు. పల్లెముందు నదిమీదవున్న వంతెనను కూల్చి ఆ పట్టణంలో వున్న ఆయుధాల గిడ్డంగులను తగులబెట్టారు.

ఇక యీ డెల్టా తక్కిన భాగాన్నంతా పట్టుకునేందుకుగాను వీట్‌మిన్ సేనాని జనరల్ గియాప్ 90 వేల సైన్యంలో సిద్ధంగా వున్నట్లు ఫ్రెంచి సేనాని సలాన్ చెబుతున్నాడు. దక్షిణ ప్రాంతంనుంచి తమ సైన్యాన్ని తరలించడానికి కారణాలను వివరిస్తూ, జనరల్ గియాప్ తన సైన్యంతో వచ్చి ఆ ప్రాంతంమీద పడడానికి సిద్ధంగావున్నాడుగనుకను, అక్కడయుద్ధానికి తలపడడంవల్ల లాభంలేదు గనుకను అట్లా చెయ్యవలసివచ్చిందని పారిస్‌లోని ఫ్రెంచి సైనికాధికారులు అంటున్నారు. మరికొందరు ఫ్రాన్సు, వీట్‌మిన్‌లు రహస్యంగా ఒక ఒప్పందాన్ని చేసుకున్నాయని, దాని అర్థమే ఇది అని అంటున్నారు. ఇంకా కొందరు ఫ్రాన్సు హానాయినిగూడా ఖాళీచేస్తుందని దానికి ఇది నాంది అని అంటున్నారు.

# గ్వాటిమాలాలో 800 మంది అరెస్టు

గ్వాటిమాలాసిటి, జూలై 3: గ్వాటమాలాలో విద్రోహులకు విజయం చేకూరిన అనంతరం ఇంతవరకు 800 మందిని కమ్యూనిస్టులనే నెపంమీద అరెస్టుచేశారు.

# హైడ్రోజన్ బాంబు పరీక్ష: మార్షల్ ద్వీప అధిక్షేపణ

## వచ్చేవారం సమితిలో చర్చకువచ్చే సూచన

న్యూయార్కు, జులై 2: పసిఫిక్ ప్రాంతంలో గత మార్చిలో హైడ్రోజన్ బాంబు ప్రయోగాలు జరుపబడినందువల్ల అక్కడి మార్షల్ ద్వీప వాసులు, తాము గురి అయిన దుష్ఫలితాలను వివరించి, దీనిపట్ల సమితికి పంపిన అధిక్షేపణపై వారం చర్చకు రావచ్చునని తెలుస్తోంది.

ఈ దీవులు సమితి అజమాయిషీ క్రింద ఉన్నాయి. వీటి పరిపాలన అమెరికా నిర్వహిస్తోంది.

పై వారం సమితి ఈ ద్వీపాలలో అమెరికా పరిపాలన గురించిన వార్షిక నివేదికపై చర్చ జరిపినప్పుడు ఈ ద్వీపవాసులు పంపిన అధిక్షేపణ తప్పకుండా వస్తుంది.

హైడ్రోజన్‌బాంబు పూర్తిగా నిషేధించడమైనా జరగాలి, లేకపోతే, ఆ ప్రాంతీయులు ప్రమాదాలకు గురికాకుండా రక్షణ అయినా ఏర్పాటు చేయాలని మార్షల్ ద్వీప వాసులు కోరారు.

లోగడ జరిపిన ప్రయోగాలవల్ల, రక్త ప్రసరణ దెబ్బతినడం, ఒళ్లు కాలడం, వెంట్రుకలు రాలిపోవడం మొదలైన దుష్ఫలితాలెన్నిటికో తాము గురి అయినామని వారు వివరించారు.

గాలి విసురువల్ల వందలకొద్ది మైళ్ళ దూరంలో ఉన్న జపాను జాలర్లే ప్రమాదాలకు గురి అయిన విషయం కూడా వీరు సూచించారు.

బుధవారమో గురువారమో ఈ దీవుల పాలన గురించి ప్రారంభమయ్యే సమితి చర్చలలో ఈ విషయం అత్యంత ప్రాధాన్యత వహించగలదని భావించ బడుతున్నది.

# కమ్యూనిస్టు దేశాలసరసన బ్రిటన్, అమెరికాల మనుగడ

## శాంతియుతంగా సాగాలనే వాంఛిస్తున్నట్లు బ్రిటిష్ మంత్రి సెల్విన్‌లాయిడ్ ప్రకటన

బ్రిడ్జివాటర్, జూలై 3: బ్రిటిష్ విదేశాంగశాఖ స్టేట్‌మంత్రి సెల్విన్‌లాయిడ్ నేడు ఇక్కడ మాట్లాడుతూ బ్రిటన్, అమెరికాలు రెండూ గూడా కమ్యూనిస్టు దేశాల ప్రక్కన శాంతియుతమైన మనుగడను వాంఛిస్తున్నాయని అన్నారు.

ఈమధ్య చర్చిల్, ఈడెన్‌లు వాషింగ్టన్ వెళ్ళోయి తమ రెండుదేశాల మధ్య స్నేహానుబంధాలను సరిదిద్దుకువచ్చారని, ఈ ప్రయాణం ప్రధానమైన ఆశయాలలో దిద్దుబాటునుగూర్చి గాక, ఆశయసాధనకుఅయిన పద్ధతులలో సర్దుబాటునుగూర్చి జరిగిందని ఈయన వివరించారు.

కమ్యూనిస్టు దేశాలతోకలిసి మనగల్గడాన్నే ఈ రెండురాజ్యాలు వాంఛిస్తున్నా, ఆ ఆశయాన్ని సాధించడం విషయంలో వీటిమధ్య భేదాలు పొడమినట్లు, వాటిని సర్దుబాటుచేసుకురావడానికే చర్చిల్, ఈడెన్‌లు వాషింగ్టన్‌కు పోయినట్లు సెల్విన్‌లాయిడ్ వెల్లడిచేశారు. కమ్యూనిస్టులతో రాయబారాలు జరపడంవల్ల ప్రయోజనం లేదని అమెరికా అనుకుంటున్నది.

# భూమి సంస్కరణల సంఘం

కర్నూలు, జూలై 4: భూమి సంస్కరణల పరిశీలనకు ఆంధ్రప్రభుత్వం నియమించిన సంఘంవారు నిర్వర్తించవలసిన విధులు యింకా నిర్ణయించబడలేదని నేడొక మంత్రివర్గ ప్రతినిధి అన్నారు. యీ సంఘానికి అధికారరీత్యా డాక్టరు శాయన్నగారు కార్యదర్శి పదవి స్వీకారం చేసినతరువాత ఆయనను సంప్రదించి యీ కమిటీచేయవలసిన పనులను నిర్ణయిస్తారు.

శాయన్నగారు త్వరలో ఇక్కడికి వస్తారనుకొంటున్నారు.

డాక్టరు శాయన్నగారిని సంప్రదించి ప్రభుత్వం ఈ సంఘం చేయవలసిన పనులను నిర్ణయిస్తుందంటూ అవి సమగ్రంగా వుంటవనికూడా ప్రభుత్వ ప్రతినిధి సూచించారు. ఆంధ్రకు వినియోగపడే కమతం పద్ధతి ఒక కుటుంబానికి ఉండవలసిన గరిష్ఠ భూమి ప్రమాణం, మొదలయినవి కూడా ఆ సంఘంవారు నిర్ణయించవలసిన విషయాలలో ఉంటవి. అయితే రాష్ట్రంలో శిస్తు విధానాన్ని సంస్కరించే విషయాన్ని యీ సంఘం పరిశీలించదని కూడా ఆయన అన్నారు.

# పార్లమెంటు వేసవి సమావేశాలు

## బెంగుళూరులో ఏర్పాటుచేసే ఆలోచనలు

న్యూఢిల్లీ, జులై 3: ఇకుపై పార్లమెంటు ఉభయ సభల వేసవిసమావేశాలు బెంగుళూరులో ఏర్పాటుచేయాలన్న సూచనను పార్లమెంటరీ వ్యవహారాల శాఖవారు పరిశీలిస్తున్నారని తెలుస్తోంది.

ఆరోగ్యప్రదమైన వాతావరణం కల బెంగుళూరులో వేసవి సమావేశాలు జరపాలని క్రిందటి నెల శ్రీనగర్‌లో జరిగిన స్పీకర్ల సమావేశంలో సూచింపబడింది.

పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి సత్యనారాయణసిన్హా ఈ విషయం గురించి త్వరలోనే ప్రధాని నెహ్రూతో చర్చిస్తారు.

బెంగుళూరులో ఒకేసారి ఇరుసభలూ సమావేశం అయితే, ఇంత మందికి అక్కడ వసతులు లభిస్తాయా అనే సమస్య గురించి ముఖ్యంగా ఆలోచించవలసి ఉంది.

# జిల్లాకు రెండు నమూనా 'నీరా భవనాలు'

## నెలకొల్పాలని ఆంధ్రప్రభుత్వ నిర్ణయం

(ఆంధ్రపత్రిక విలేఖరి)

కర్నూలు జులై 4: రాష్ట్రంలోని పదకొండు జిల్లాలలోనూ ఒక్కొక్క జిలాలో రెండేసి నమూనా "నీరాభవనాలను" ప్రారంభించాలని ఆంధ్రప్రభుత్వం నిర్ణయించింది. ఇవి కాక తాటిచెట్టునుంచి వివిధ వస్తువులను తయారు చేసే మూడు వందల కేంద్రాలను కూడా ఈ యేడాదిలో ప్రారంభించుతారు.

మాజీ గీతపనివారికి సహాయం చేసే ఉద్దేశంతో రాష్ట్ర ప్రభుత్వం యీ ప్రణాళికను నిర్ణయించింది. మొదట్లో సుమారు పదివేల మంది మాజీ గీతపని వారికి ఈ ప్రణాళిక వల్ల సహాయం జరుగుగలదనుకుంటున్నారు.

నీరాను శాస్త్రీయమైన ఆరోగ్యకరమైన పద్ధతులలో తయారు చేసే విషయంలోనూ, 'నీరా' నుంచి తాటి బెల్లం, మొదలయిన తినుబండారాలను తయారు చేసే విషయంలోనూ మాజీ గీతపనివారికి శిక్షణ ఇచ్చే దృష్టితో నూ ఒక ఉత్పత్తి శిక్షణా కేంద్రాన్ని త్వరలో స్థాపించాలని కూడా ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించింది.

ప్రతి జిల్లాలో నూ నెలకొల్పే రెండు 'నీరా భవనాల' తో పాటు వాణిజ్య కేంద్రాలలో మరికొన్ని 'నీరా భవనాలను' కూడా స్థాపించాలని ప్రభుత్వం నిర్ణయించింది. రాష్ట్ర ప్రభుత్వ అభివృద్ధిశాఖ అధికారి అజమాయిషీలో ప్రభుత్వ అభివృద్ధి శాఖవారే ఈ నీరా భవనాలను నడుపుతారు. లైసెన్సు లున్న సర్వర్లను ఏర్పాటు చేసి, ఆరోగ్యకరమైన పరిస్థితులలో నడపడం ద్వారా ఈ 'నీరా భవనాలను' ఆకర్షణీయంగా రూపొందించాలను కొంటున్నారు. బాగా రుచిగా ఉండడానికిగాను తినుబండారాలను చల్లపరిచే యంత్రాలలో 'నీరా'ను ఉంచుతారు. 'నీరా' వాడకం ఎక్కువ చెయ్యడానికిగాను ప్రజలలో ప్రచారం చేయించాలని కూడా రాష్ట్ర ప్రభుత్వం సంకల్పించింది.

ఆంధ్ర ప్రభుత్వం నెలకొల్పనున్న మూడువందల ఉత్పత్తి కేంద్రాలనూ ప్రభుత్వం గుర్తించిన సంఘాలూ, సహకారసంఘాలు, తాటిచెట్టునుంచి రకరకాల వస్తువులు తయారుచేయడంలో పనిచేస్తున్నవారు నడుపుతారు. ఇట్టి వస్తువులను తయారుచేయడంలో సహాయపడే 'గైడ్' అజమాయిషీలో అవి పనిచేస్తవి. ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క ఆర్గనైజర్ ఈ విషయంలో ఆయనకు సహాయపడతాడు. ఉత్పత్తి శిక్షణ కేంద్రాలలో మొదటిసారి మూడువందలమంది మాజీ గీతపని వారికి మూడునెలల పాటు శిక్షణఇస్తారు. ఆ విధంగా శిక్షణపొందిన వారు ఇతర ఉత్పత్తి కేంద్రాలలో యితరులకు శిక్షణ ఇస్తారని ఆశించబడుతున్నది.

ఇప్పుడు సహకారశాఖ అధ్వర్యంలో వున్న దుకాణాల ద్వారా ఈ వస్తువుల విక్రయానికి ఉపయోగపడే ప్రణాళికనుకూడా ప్రభుత్వం ఆమోదించింది. ఈ దుకాణాలను అభివృద్ధి శాఖకు మార్చాలను కొంటున్నారు. ఈ ప్రణాళిక స్వయంపోషక మైనదని అంటున్నారు.

# గుడియాత్తం ఉపఎన్నిక పోలింగుతేదీ

మద్రాసు, జూలై 4: మద్రాసు ముఖ్యమంత్రి కె. కామరాజనాడారు గారు పోటీచేస్తున్న గుడియాత్తం నియోజకవర్గ ఉపయెన్నిక పోలింగు ఆగస్టు 1వ తేదీ ఉదయం 7 గం. నుంచి 12 గం. ల వరకున్నూ, మధ్యాహ్నం 1 నుంచి 5 గం. ల వరకున్నూ జరుగుతుంది.

# ఆంధ్రలో ఆరుప్రసూతి చికిత్సాకేంద్రాలు

## ఈ యేడు స్థాపించాలని ఆంధ్ర ప్రభుత్వ నిర్ణయం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

కర్నూలు, జూలై 4: తగిన ప్రదేశాలలో ఈ యేడాదిలో ఆరు ప్రసూతి చికిత్సా కేంద్రాలను ప్రారంభించాలని ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించింది. ప్రసూతి చికిత్సా కేంద్రాల అవసరం విశేషంగా వున్న ప్రదేశాలలో ఈ ఆరు చికిత్సా కేంద్రాలనూ, కేంద్ర ప్రభుత్వ ఆరోగ్యశాఖమంత్రిణి రాజకుమారి అమృతకౌర్ సూచించిన అఖిల భారత ప్రణాళికలో భాగంగా నెలకొల్పుతారు. ఈ కేంద్రాల నిర్వహణ ఖర్చును కేంద్ర ప్రభుత్వం యిస్తుంది.

ఈ కేంద్రాలకు ఏటేటా అయ్యే ఖర్చులో మొదటిసంవత్సరం నూటికి 66 2/3 వంతులూ, రెండవ సంవత్సరం నూటికి యాభయివంతులూ, మూడవ సంవత్సరం మూడవవంతూ కేంద్ర ప్రభుత్వం భరించుతుంది. ఇక ఆతరువాత రాష్ట్రప్రభుత్వమే వాటిని భరించాలి.

ఈ స్కీముని కేంద్రప్రభుత్వ ఆమోదానికి పంపించి, ఈ కేంద్రాల నిర్వహణ ఖర్చుకు కేంద్రప్రభుత్వం వీలయినంత త్వరగా మంజూరుచెయ్యడానికి వీలుగా వీని వివరాలను రాష్ట్ర ప్రభుత్వం తయారుచేయిస్తున్నట్లు తెలిసింది.

గిండీలోని కింగ్ ఇన్‌స్టిట్యూట్ పద్ధతులలో పరిశోధనాలయం నెల

# మదనపల్లిలో సానుభూతి హర్తాళ్

మదనపల్లి, జూలై 3: చిత్తూరు జిల్లా లారీ యజమానుల సమ్మెపట్ల సానుభూతిగా ఈ పట్టణంలోని దుకాణా లన్నింటినీ నేడు మూసివేశారు.

లారీలపై రెండు రకాల పన్నులకు నిరసనగా లారీ యజమానుల సమ్మె ఈ నెల మొదటి తేదీన ప్రారంభమయింది.

ఈ సందర్భంలో శాసనసభ్యులతో సహా కొంతమంది రాష్ట్రప్రభుత్వ రవాణాశాఖమంత్రివద్దకు రాయబారం వెళ్ళనున్నారని తెలిసింది.

కొల్పడం వంటి ఇతర ప్రణాళికలను వచ్చే సంవత్సరంలోగా అమలుజరపరని అనుకొంటున్నారు. ఆ స్కీములకు కూడా ఆర్థిక సహాయం చేయవలసిందిగా భారతప్రభుత్వాన్ని ఆంధ్రప్రభుత్వం అభ్యర్థించింది.

# పోర్చుగీసు వలసల విముక్తికి ప్రత్యక్షచర్య

## —అశోక్ మెహతా ప్రకటన

బొంబై, జూలై 3: భారత దేశంలోని పోర్చుగీసు వలసల స్వాతంత్ర్యసాధన భారతీయుల సమస్యఅనీ, భారతీయులు ఇందులో ప్రత్యక్షంగా జోక్యం చేసుకోవడం అవసరమనీ ప్రజాసోషలిస్టుపార్టీ కార్యదర్శి అశోక్ మెహతా ఇవాళ ఉద్ఘాటించారు.

ఫ్రెంచి వలసల విముక్తికి ఉద్యమం ఇంతవరకూ ఆ వలసలలో ఉన్న ప్రజల తలపైనే వదిలివేయడమే మనలో చాలామందికి ఎంతో బాధకరంగా ఉన్నదనీ, ఈ పరిస్థితిలోనే, పోర్చుగీసు వలసల దాస్యవిముక్తికూడా అక్కడి ప్రజలకే వదిలివేయడం ప్రమాదకరమైనదనీ ఆయన అన్నారు.

గోవా సమస్య భారతీయులది. భారతజాతి గౌరవ ప్రతిష్ఠలకు, స్వాతంత్ర్యానికీ సంబంధించినది. ఈ సమస్య భారతీయులది. భారతప్రభుత్వానిది. గోవా పోర్చుగీసు ప్రాంతమనీ, అక్కడివారు పోర్చుగీసు ప్రజలనీ పోర్చుగల్ చేసిన వాదాన్ని భారతదేశం అంగీకరించడం ఆసంభవం. వారి ప్రకటన అవమానకరంగా ఉంది. అని అశోకమెహతా ఉద్ఘాటించారు.

కొరియా ఇండో చైనాల విషయంలో ఆందోళన చెంది, నిరంతర కృషి చేస్తున్నందుకు మన ప్రభుత్వం అభినందనీయమైనది.

అయితే, ఇంత శ్రద్ధ, పట్టుదల భారతీయ వలసల సమస్య పట్ల చూపకపోవటం శోచనీయం అని ఆయన అన్నారు.

# ఎనమండుగురిఅరెస్టు

గత మూడు రోజులలోనూ గోవాలో అధికారులు ఎనమండుగురిని అరెస్టుచేశారని విశ్వసనీయవర్గాల ద్వారా తెలుస్తూంది.

వీరిలో ఇద్దరు సుప్రసిద్ధ న్యాయవాదులూ, ఒక డాక్టరూ, ఒక ఉపాధ్యాయుడూ, ఇద్దరు విద్యార్థులూ ఉన్నారని తెలుస్తూంది.

లయన్స్, జూలై 3: రోన్ లోయలో ఒక డీసెల్ కారున్నూ, గూడ్సు బండియున్నూ ఢీకొన్న కారణంవల్ల జరిగిన ప్రమాదంలో 19 మంది చనిపోయారు. 50 మంది గాయపడ్డారు.

# తూర్పు పాకిస్థాన్‌లో గవర్నరు పాలన

## ప్రజాస్వామిక విరుద్ధమని పాక్ పార్లమెంటులో దత్తా విమర్శ

కరాచీ, జూలై 3: "తూర్పు పాకిస్థాన్‌లో గవర్నరుపాలన ప్రవేశపెట్టడం ప్రజాస్వామికానికి విరుద్ధం. ఏ విధంగానూ సమర్థింపరానిది. అనవసరమైనది" అని తూర్పుబెంగాల్ స్వతంత్రసభ్యుడు డి. ఎన్. దత్తా ఇవాళ పాకిస్థాన్ పార్లమెంటులో నిశితంగా విమర్శించారు.

ఈయన ప్రసంగిస్తున్నంతసేపు సభలో ముస్లింలీగుసభ్యులు చీటికీమాటికీలేచి అడ్డుప్రశ్నలు వేస్తూనే వచ్చారు. వీళ్లని వూరుకోబెట్టడానికి సభాధ్యక్షుడు పదేపదే గంట మోగించవలసి వచ్చింది. దత్తా ప్రసంగానికి అభ్యంతరాలు చెప్పదలచేవారు క్రమబద్ధంగా లేచి చెప్పాలని, రభస చేయరాదనీ కొందరు సభ్యులకు సూటిగా చెప్పారు.

లీగు సభ్యులు తెచ్చిన పాయింట్ ఆఫ్ ఆర్డర్‌లన్నిటినీ అధ్యక్షుడు త్రోసిపుచ్చారు.

నేటి సమావేశానికి నిర్దేశించబడిన మూడుగంటల వ్యవధిలోనూ రెండుగంటలసేపు దత్తా ప్రసంగించారు.

తూర్పుబెంగాల్ గవర్నరు పాలనను తీవ్రాతితీవ్రంగా ఈయన విమర్శించారు.

గవర్నరుపాలన ప్రవేశపెట్టడం గురించిన ఈ చర్చని నేడు ప్రధాని మహమ్మదలీయే ప్రారంభించారు.

# మద్రాస్, బొంబై రేవులనుంచి మిర్చి ఎగుమతికి అనుమతి

## —కేంద్ర ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, జులై 3: 1954 ఉత్తరార్ధంలో (జులైనుంచి-డిసెంబరు వరకూ) మద్రాసు బొంబై రేవులనుంచి కొద్దిగా మిరపకాయలు ఎగుమతికి అనుమతించడానికి కేంద్ర ప్రభుత్వం నిశ్చయించిందని నేడు కేంద్ర వాణిజ్యపారిశ్రామికశాఖ ఒక ప్రకటన చేసింది.

ఈ ఎగుమతులకు లైసెన్సులు ఇచ్చే విధానాలు, ఇతర వివరాలూ, మద్రాసు బొంబై రేవులకు ఎగుమతి సంస్థల అధికారులు అందచేస్తారని ఈ ప్రకటన తెలియజేస్తున్నది.

